

# మానవ ధర్మము

శౌచమ్ ఇంద్రియనిగ్రహః

అస్తేయమ్ ధీః

దమః విద్యా

క్షమా సత్యమ్

ధృతిః అక్రోధః



## దశకం ధర్మ లక్షణమ్ (మనుస్మృతి)



కర్త:
సుమార్థి
(డా॥ కోడూరి సుబ్బారావు)

గాయత్రీ ఆశ్రమ ప్రచురణ



# మానవ ధర్మము

(పరివర్ధిత పంచమ సంస్కరణము)


కర్త :

**సుమ్నార్థి**

(డా. కోడూరి సుబ్బారావు)



ప్రకాశకులు :

**గాయత్రీ ఆశ్రమ ట్రస్టు**

ఆర్యసమాజము-వ్యాస్‌నగర్, మేడిబావి, వారాసిగూడ,

సికింద్రాబాద్ - 500 061.

గాయత్రీ గ్రంథమాల : 3

# మానవ ధర్మము

షష్ఠమ పరివర్ధిత ముద్రణ ప్రతులు : 1000



సృష్టిసంవత్సరము : ః 197, 29, 49, 119
విక్రమాబ్దము : 2075
కలియుగాబ్దము : 5119

శ్రీ విళంబినామ సం॥ అధిక జ్యేష్ఠ బ॥ చవితి (2-6-2018)
తెలంగాణ ఆవిర్భావ దినం

**మూల్యము : రూ. 40-00**

ప్రతులకు :

1. గాయత్రీ ఆశ్రమ ట్రస్టు,
   కార్యదర్శి : కె.పి. నర్సింగరావు,
   12-10-586/6, ఆర్యసమాజము, వారాసిగూడ,
   సికింద్రాబాద్ - 500 061.
   సెల్ : 98480 11073, 6301044860
2. డా॥ కోదూరి సుబ్బారావు, వైదికవానప్రస్థాశ్రమం,
   హనుమాపురం (B.O.) ; (Via.) భువనగిరి గంజ్ - 508 116.
   సెల్ : 9290604641, 9908994084.
3. ఆర్యసమాజ మందిరము, రైల్వే ఫ్లైఓవర్ దగ్గర,
   సీతాఫలమండి - 500 061. సెల్ : 9133134156
4. ఆర్యసమాజము, కూచిపూడి - 522 313 (తెనాలి తాలూకా).
   ఫోన్ : 08644-252789.

*Printed at :*

**PRINTSHOP** - 040-6632 0300.

# ఈ పుస్తకంలో



చదవండి ఆచరించండి తరించండి

## పాఠకులకు నా మాట

"వేదోఽ ఖిలో ధర్మమూలమ్" మనుస్మృతి (2-6)

'వేదములే ధర్మమునకు మూల'మని పై వాక్యమున కర్థము. వేద మనగా జ్ఞానమని అర్థమున్నను మన మహాఋషులు సృష్ట్యాదిలో పరమేశ్వరుని ద్వారా మానవులకు లభించిన జ్ఞానమునకే వేదము లని పేరిడిరి. అందు మానవులకు వలయు సర్వ విద్యలు, విజ్ఞానములు బీజరూపమున ఉపదేశింపబడినవి. వేదములందు కేవలము భౌతిక విద్యలేకాక ఉత్తమ మానవ జన్మను బొందిన జీవునకు శారీరక, బౌద్ధిక, సామాజిక, ఆత్మోన్నతులకు అవసరమగు జ్ఞానమంతయు ఉపదేశింపబడినది. ఆ అభ్యుదయని శ్రేయస్సులను కలిగించు జ్ఞాన సూత్రములకే ధర్మమని మన మహర్షులు పేరిడిరి. ఈ సమస్త చరాచర జగత్తును సృజించి, ధరించి, పాలించి పోషించుచున్న పరమేశ్వరుని ఉపదేశము లగుటచే అందు ఏ విధమైన భ్రమ ప్రమాదములు ఉండవు. వివిధ మతములలో వలె స్వార్థ సంకుచిత భావాలుండవు. అవి దేశకాలాతీతములై సర్వమానవులు సర్వకాలములందును ఆచరించదగినవై యుండును. అట్టి వేద ధర్మములతో నేర్పడిన దగుటచే మన మతమును హిందూమత మనుటకంటె వేదమతము - వేదధర్మము - వైదిక ధర్మము అనుట సమంజసము.

"ఆహార నిద్ర భయ మైథునం చ సామన్యమేతత్ పశుభిర్నరాణామ్।
ధర్మో హి తేషా మధికో విశేషో ధర్మేణ హీనా పశుభిః సమానాః ॥ (హి॰. 1-25)

ఆహారము తీసికొనుట, నిద్రించుట, మరణమునకు కష్టములకు భయపడుట, సంతానోత్పత్తి చేయుట యను నాలుగు విషయములును పశువులకు, మానవులకు సమానమే. మానవునిలో విశేషముగా ధర్మ మను గుణముండును. అట్టి ధర్మగుణము లేనిచో మానవులు పశువులతో సమానులే.

ఆదిమానవ గ్రంథమైన మనుస్మృతి వేదముల ఆధారముగా ధర్మమును గూర్చి విస్తృతముగా చర్చించినది. ఆ గ్రంథమునందే బాలురు మొదలు వృద్ధులవరకు, పామరులు మొదలు పండితుల వరకు మానవ మాత్రులందరు తప్పక కలిగి ఉండవలసిన, మానవతకు అనివార్యమైన 10 మూల లక్షణములు (బేసిక్ క్యారెక్టరెస్టిక్) చెప్పబడినవి. వాటి సంక్షిప్త వ్యాఖ్యానమే ఈ లఘు గ్రంథము.

వైదిక ధర్మానురాగి
సుమ్మార్థి
(కోదూరి సుబ్బారావు)

# కీ.శే. శ్రీ ముర్కి లక్ష్మీనర్సయ్యగారి పరిచయం

ఓం వాయురనిల మమృత మథేదం భస్మాంతం శరీరమ్ ।
ఓ3మ్ క్రతోస్మర, క్లిబేస్మర, కృతం స్మర ॥

— యజుర్వేదం (40-15)

హే క్రతో ! కర్మశీల మానవా ! దేహావసాన సమయంలో నీ శరీరంలోనికి ప్రవహించే వాయువు (ప్రాణము) నిలిచిపోతుంది. శరీరం మరణిస్తుంది కాని, జీవాత్మవైన నీవు మరణించవు. సర్వసంరక్షక సర్వేశ్వరుని 'ఓ3మ్' నామంతో స్మరించు. ఆత్మజ్ఞాన సామర్థ్యం కొరకు స్మరించు. ప్రార్థించు. ఇంతవరకు ఈ శరీరంతో చేసిన శుభాశుభకర్మలను స్మరించు - వాటిని ఒకసారి గుర్తుచేసుకో. జరిగిన అశుభకార్యాలకు - పాపాలకు పశ్చాత్తాప పడు, శుభకర్మల - పుణ్యకర్మల ఫలాలను పరమాత్మకు అర్పించు. వాటితో ఏ భౌతిక సుఖాన్ని ఆశించక జన్మరాహిత్యాన్ని-ముక్తిని కోరుకో

శ్రీముర్కి లక్ష్మీనర్సయ్యగారు సిద్ధిపేట తాలుకా చింతమడక గ్రామంలో శ్రీ ముర్కిరామయ్య, శ్రీమతి భూలక్ష్మీ దపంతులకు మూడవ కుమారునిగా కీ.శ. 1935వ సంవత్సరంలలో జన్మించారు. వీరికి శ్రీ సోమయ్య, శ్రీ ఈశ్వరయ్య అను పేర్లుగల యిద్దరు అన్నలు, శ్రీమతి రంగవ్వ అను ఒక అక్కగారు, శ్రీమతి నాగవ్వ, శ్రీమతి లక్ష్మీ అను పేర్లు గల యిద్దరు చెల్లెండ్రు గలరు. వీరి తండ్రిగారు అదే గ్రామంలో చిన్న కిరాణా దుకాణం పెట్టుకొని, వ్యవసాయం కూడా చేసుకుంటూ పిల్లలను పెంచిపోషిస్తూ ఉండేవారు. శ్రీ లక్ష్మీనర్సయ్యగారు 12 సంవత్సరాల వయస్సులో ఉన్నపుడు తండ్రిగారు వ్యాపారం నిమిత్తం సికింద్రాబాద్ చేరుకొని చిన్నకిరాణా దుకాణం పెట్టుకున్నారు.

శ్రీ లక్ష్మీనర్సయ్యగారు సిద్ధిపేటలో ఉర్దూ మీడియంలో 3వ తరగతి వరకు చదువుకొన్నారు. సికింద్రాబాద్‌కు వచ్చిన తరువాత ఒక బట్టల దుకాణంలో పనిచేస్తూ, ప్రైవేటుగా హిందీ పరీక్షలు వ్రాశారు. హిందీలో 'విశారద' పరీక్షలో ఉత్తీర్ణులయ్యారు.

వీరు హిందీ తరగతులు చదువుకునేటప్పుడే శ్రీ ఆర్. రామచందర్ ఆర్యగారితో పరిచయం, స్నేహం ఏర్పడ్డాయి. వీరిద్దరికి ఆర్యసమాజ కార్యకర్తలు

వం. నారాయణస్వామిగారు వైదిక ధర్మంపట్ల శ్రద్ధను కలిగించి ఆర్యసమాజంలో జరిగే సత్సంగాలకు తీసుకువెళ్ళేవారు. దానితో వీరిరువురకు ఆర్యసమాజ పరిచయం, వైదిక సిద్ధాంతాల జ్ఞానం కలిగింది. క్రమంగా ఆర్యసమాజం ద్వారా శ్రీ బాశెట్టి సత్తయ్య, శ్రీ పటాల కృష్ణారావు మొదలగు వారితో పరిచయం, స్నేహం ఏర్పడ్డాయి. శ్రీలక్ష్మీనర్సయ్య గారికి 1961లో శ్రీమతి గ్రంథి రాములమ్మ, శ్రీ దొరస్వామిశెట్టి గార్ల పంచమ పుత్రిక రాధాబాయి గారితో వివాహం జరిగింది.

శ్రీ లక్ష్మీనర్సయ్యగారు ప్రారంభంలో హిందీ తరగతులు చదువుకుంటూ శ్రీ దాచేపల్లి బుక్‌డిపోలో గుమస్తాగా పనిచేశారు. అనంతరం శ్రీ రతన్‌చంద్ గారి బట్టల దుకాణంలో పనిచేశారు. అప్పుడు వారికి గుమస్తా పనికన్న ఏదైనా చిన్నవ్యాపారం పెట్టుకోవటం మంచిదనే ఆలోచన కలిగింది. 1965వ సంవత్సరంలో అగరబత్తీలు, సుపారీ పోట్లాలు తయారుచేసి అమ్ముకునే వ్యాపారం పెట్టుకున్నారు. క్రమంగా ఆ వ్యాపారం పెరిగి పెద్దదయ్యింది. 1970లో నాలాబజార్‌లో నాలుగు గదులు గల యిల్లు కిరాయికి తీసుకొని 30మంది పనివారలను పెట్టుకుని వ్యాపారాన్ని వృద్ధిచేసుకున్నారు. అరగబత్తీలకు "సౌభాగ్యలక్ష్మి" అనీ, సుపారీకి "రాజు" అని ట్రేడ్ నేమ్స్ పెట్టుకుని మంచి పేరు సంపాదించారు.

1978 నుండి బేగంబజార్‌లో వ్యాపారం ప్రారంభించారు. అక్కడ పనివాళ్ళు సరిగా దొరకక 10మంది పనివారితో తాము, తమ పిల్లలు కూడా పనిచేసుకుంటూ వ్యాపారాన్ని నడిపించారు. పిల్లలను పెంచి పెద్దచేసుకుంటూ, వాళ్ళని చదివిస్తూ గృహస్థధర్మాలను నిర్వర్తించేవారు. వీరిద్దరికి వైదిక సిద్ధాంతలపై శ్రద్ధ ఏర్పడుటచే వారింట జరిగే నామకరణ, చూడాకర్మ, కర్ణవేధాది శుభకార్యాలన్ని ఆర్ష విద్వాంసులను పిలిపించుకొని అగ్నిహోత్ర పూర్వకంగా ఆ యా సంస్కారాలను జరిపించుకునేవారు. అతిథులను, విద్వాంసులను చక్కగా సత్కరించేవారు. 1962వ సంవత్సరంలో వీరికి పెద్ద కుమార్తె జన్మించింది. ఆమె పేరు రమాదేవి. 1970లో రెండవ సంతానంగా కుమారుడు జన్మించాడు. పేరు చంద్రకాంత్. 1972లో రెండవ కుమార్తె గాయత్రి జన్మించింది. 1975లో చివరగా నాల్గవ సంతానంగా మూడవ కుమార్తె ప్రసన్న జన్మించింది. కుమార్తెలు ముగ్గురిని 10వ తరగతి

వరకు చదివించి ముగ్గురికి వైదిక పద్ధతిలో పెండ్లిళ్ళు చేసి అత్తవారిళ్ళకు పంపించారు.

అబ్బాయి చంద్రకాంత్ వివాహం ఒంగోలు వాస్తవ్యులు శ్రీ కొత్త నరసింహారావు, శ్రీమతి రాజ్యలక్ష్మి గార్ల ద్వితీయ కుమార్తె శ్రీదేవితో 1994వ సంవత్సరంలో వైదిక పద్ధతిలో జరిపించారు. ఈ దంపతులకు వందన అను కుమార్తె, వికాస్ అను కుమారుడు కలిగారు.

వ్యాపారం ద్వారా వచ్చిన డబ్బులలో కొంతభాగం దాచుకుంటూ 1974వ సంవత్సరంలో ఓల్డ్ వాసవీనగర్‌లో ఒక ప్లాటు కొనుకున్నారు. క్రమంగా మరికొంత డబ్బు సమకూర్చుకొని 1981లో ఇల్లు కట్టుకున్నారు.

పూర్వజన్మ సంస్కారాల వల్ల ఆర్య విద్వాంసుల సత్సంగాలలో పాల్గొనటంవల్ల శ్రీ లక్ష్మీనర్సయ్య గారికి వైదిక ధర్మంపై చక్కటి శ్రద్ధ ఏర్పడింది. ఇంట్లో ప్రతిదినము సంధ్యాగ్నిహోత్రాలు చేసుకునేవారు. ఇంట్లో జరిగే శుభకార్యాలన్నీ వైదిక పద్ధతిలో జరుపుకునేవారు. తరచుగా వారి ఇంట్లో సంత్సంగాలు ఏర్పాటుచేసి విద్వాంసులను సత్కరించేవారు. అతిథులకు చక్కటి ఆతిథ్యమిచ్చేవారు. శక్తికొలది దానధర్మాలు చేసేవారు.

అట్టి శ్రీ లక్ష్మీనర్సయ్యగారు 21-08-2017 సా॥ 6-15 ని॥లకు సోమవతి అమావాస్యనాడు కుటుంబాన్నంతా దుఃఖసాగరంలో ముంచివేస్తూ దివగంతులయ్యారు. భార్య, కుమారుడు, కుమార్తెలు వైదిక పద్ధతిలో అంత్యేష్టి సంస్కారం జరిపించారు. వారి పావన స్మృతిలో ఈ 'మానవ ధర్మము' పుస్తకాన్ని 1000 ప్రతులు ముద్రించి 200 ప్రతులు వితరణ చేశారు. మిగిలిన 800 ప్రతులు మా గాయత్రీ ఆశ్రమ ట్రస్టునకు దానంగా అందజేశారు. వారికి మా హృదయపూర్వక ధన్యవాదములు. సర్వవ్యావక సర్వేశ్వరుడు వారికి దీర్ఘ ఆయురారోగ్య ఐశ్వర్యాలనిచ్చి కాపాడునుగాక.

\- గాయత్రీ ఆశ్రమ ట్రస్టు

# ఈశ ప్రార్థన




ఇన్ద్ర మృళ మహ్యం జీవాతు మిచ్ఛ
చోదయ ధియమయసో న ధారామ్ ।
యత్కిఞ్చాహం త్వాయురిదం వదామి
తజ్జుషస్వ కృధి మా దేవవన్తమ్ ॥

(ఋ. 6-47-10)

ఓ ఇంద్ర! పరమైశ్వర్య ప్రదాతవైన ఓ పరమేశ్వర ! దయతో నాకు ధర్మసాధన చేయ జీవితేచ్ఛను ప్రసాదింపుము. జ్ఞానసాధనమైన నాబుద్ధిని ఖడ్గధారవలె పదునుబెట్టి నన్ను నీ వేదజ్ఞానమును గ్రహించ సమర్థుని జేయుము. నిన్ను చేరగోరు నాకు అవసరమగు యమ నియమాది అష్టాంగముల సిద్ధిని ప్రాప్తింపజేయుము. నన్ను దివ్యగుణయుక్తుని జేసి నీ దరి జేర్చుకొమ్ము.

విన్నవించు
ఒక ముముక్షువు
కోడూరి సుబ్బారావు

# మానవ ధర్మము

**ధర్మమనగా నేమి ? దాని లక్షణము లెన్ని ?**

'ధర్మ' మను పదమును మనము నిత్యవ్యవహారములో తరచు ప్రయోగిస్తూ ఉంటాము. కాని 'ధర్మము' అంటే ఏమిటి? అనే ఆలోచన ఎవ్వరూ చేయరనే చెప్పవచ్చును. ఒకవేళ ఎవరైనా మనను ఈ ప్రశ్న అడిగినా సమాధానము చెప్పగలవారు చాలా అరుదు. వారి సమాధానములు కూడ వేరువేరు విధములుగా నుండును. చాలామంది దృష్టిలో మతము ప్రబోధించేది ఆచరించుటయే ధర్మము. దానికి భిన్నమైనదంతయు అధర్మము. ఆ మత ప్రబోధము నేటి విజ్ఞానానికి, హేతువాదానికి వ్యతిరేకమైనను ఆచరించుటయే ధర్మము - పుణ్యము. ఆచరింపకున్న అధర్మము - పాపము అని భావింతురు. మరి కొందఱి దృష్టిలో ఆస్తిక్యము పేర జరిపే కర్మకలాపములే ధర్మ కార్యములు. అనగా అభిషేక పూజాదికములు, భజన కీర్తనలు, మంత్ర జపములు, గురుసేవా శుశ్రూషలు, తీర్థయాత్రలు, మానసచరితాది గీతాపఠనములు, మృత పితరులకు పిండప్రదానాదులు, శ్రాద్ధ తర్పణములు, వివిధ దేవీ దేవతల వ్రతములు, ఉపవాసాది తపములు చివరకు - హిందువుల విభూతి తిలక ధారణలు, మహ్మదీయులు పెంచుకునే వివిధ రకముల గడ్డములు, క్రైస్తవుల మెడలలోని శిలువ ధారణలు ఇవియన్నియు ధర్మ కార్యములుగానే వ్యవహరింపబడు చుండును. ధర్మము పేరిట జరిగే ఈ మూఢాచారలను, విజ్ఞాన విరుద్ధ నమ్మకాలను, బాహ్యాడంబరాలను, మతం పేరిట పెంచుకున్న పరస్పర ద్వేషభావాలను చూసి నాస్తికులు దైవముతో బాటు ధర్మాన్ని కూడ నిరసించు చున్నారు. కనుక సామాన్యులు, మేధావంతులుకూడ ధర్మం గురించి సరియైన అవగాహన కలిగియుండుట చాలా అవసరము.

'ధర్మ' మను పదము **'ధృ-ధారణే'** అను ధాతువుతో నిర్మితమగును. 'ధరించునది' అని దీనికి అర్థము. అందుచేత **'ధరతీతి ధర్మః'** అని నిర్వచనము. ఒక ఋషి -

**ధారణా ద్ధర్మ ఇత్యాహుః ధర్మో ధారయతే ప్రజా : ।**

**యత్స్యాద్ధారణ సంయుక్తం స ధర్మ ఇతి నిశ్చయ : " ॥**

అని వివరించెను. అనగా ప్రజలను ధరించునది గనుక దీనికి ధర్మమని పేరు. కనుక యెల్లప్పుడూ సర్వకాల సర్వావస్థలయందు ధారణ చేయవలసిన సద్గుణములనే ధర్మమందురని యభిప్రాయము. ఇంతేకాక కణాద మహర్షి తన వైశేషిక దర్శనమందు -

**"యతోऽ భ్యుదయ నిఃశ్రేయస సిద్ధిః స ధర్మః "**

అని నిర్వచించెను - అనగా దేని నాచరించుటవలన మానవమాత్రులైన వారి కెవ్వరికైనను ఈ లోకమున అభ్యుదయము - అనగా శారీరక, ఆర్థిక, సామాజిక యున్నతియు పరంపరగా నిఃశ్రేయసము - ఉత్తమ శ్రేయస్సు ఐన ముక్తి కలుగునో అది ధర్మమని యభిప్రాయము. ధర్మ పదమునకు ఇంత విశాల అర్థముండగా ఒక వ్యక్తి అభిప్రాయములతో ఏర్పడిన మతమును, మత కార్యకలాపములను ధర్మ మనుకొనుట హాస్యాస్పదమే యగును. ధర్మము సార్వజనీన మగును గాని ఒక వ్యక్తికి, ఒక వర్గానికి చెందినది ఎంతమాత్రము కాదు. ఏ దేశవాసులైనను, ఏ వర్గానికి చెందివారైనను, రాజులు, పేదలు, భృత్యులు, విద్యావంతులు, నిరక్షరాస్యులు, స్త్రీలు, పురుషులు, యజమానులు, వారు వీరననేల మానవమాత్రులందరు కలిగియుండవలసిన సద్గుణములను, సదాచారములను మాత్రమే "ధర్మమని" చెప్పవలెను. వాటిని ధరించినవాడినే - కలిగియున్నవాడినే ధర్మాత్ముడు - మానవత్వాన్ని కలిగిన మనిషి యని చెప్పవలెను. ఉష్ణము, ప్రకాశము అను గుణములను కలిగియున్నప్పుడే అగ్ని అగ్నియని పిలువబడుచున్నది. ఇది అగ్ని ధర్మము. ఆ యుష్ణ ప్రకాశములను గోల్పోయిన అది యగ్నియని పిలువతగదు. అది తన గౌరవమును గోల్పోవును. మట్టిగా మారును. ప్రజలు దానిని కాలిక్రిందవేసి త్రొక్కుదురు. అట్లే సద్గుణాలను, సదాచారాన్ని కోల్పోయిన వ్యక్తిని మానవు డనతగదు.

అగ్నికి ఉష్ణ ప్రకాశములవలె మానవున కుండవలసిన గుణము లెవ్వి? ఏ గుణములు కలిగినవానిని మానవు డని చెప్పదగును? అను జిజ్ఞాస అవసరము. జాగ్రత్తగా నాలోచించిన వివిధ జంతువులనుండి, పశుపక్ష్యాదుల నుండి మానవుణ్ణి ఏ సద్గుణములు వేరుచేయునో వాటినే ధర్మమని చెప్పదగును.

అందుచేతనే ఆదిశంకరులు -

**"ఆహార నిద్రా భయమైథునాని సామాన్యమేతత్ పశుభిర్నరాణాం ।**
**ధర్మో హి తేషామధికో విశేషో ధర్మేణహీనాః పశుభిస్సమానాః ॥**

అన్నారు. ఆహారము, నిద్ర, ప్రాణభయము, మైథునకార్యము ద్వారా సంతానోత్పత్తి పశువులకు మానవులకు ఒకేరకముగా నుండును. కాని మానవులలో ధర్మ మనునది విశేషముగా నుండును. అది వారిని పశువులనుండి వేరుచేయును. అట్టి ధర్మాన్ని కలిగియుండనివాడు పశుతుల్యుడగునని దీనిభావము. అయితే ఆ సార్వజనీన మానవధర్మ లక్షణములు (సద్గుణములు) ఎవ్వి ? అవి ఎన్ని ? అను ప్రశ్నలు పండితులకుకూడ కొరకరాని కొయ్యలుగా నుండును. క్రీ.సం. 1869 లో కాశీపట్టణమున ఆనందబాగ్‌లో కాశీరాజు అధ్యక్షతన ఒక శాస్త్రార్థము జరిగెను. అందు పండిత ప్రకాండులను మహర్షి దయానందుడు ఈ ప్రశ్నయే అడిగెను. ఒక్కరును జవాబు చెప్పజాలకపోయిరి. అప్పుడు దయానందుడు మనుస్మృతిలోని ఒక శ్లోకమును చదివి వినిపించి ఈ దశగుణ యుక్తమైనదే మానవధర్మమని వివరించెను.

ఆ ప్రసిద్ధ శ్లోకము ఏదనగా -

**ధృతిః క్షమా దమోఽస్తేయం శౌచ మింద్రియ నిగ్రహః ।**
**ధీ ర్విద్యా సత్య మక్రోధో దశకం ధర్మ లక్షణమ్ ॥ మనుస్మృతి 6-92**

సదా ధైర్యము కలిగియుండుట, నిందాస్తుతులందు, మానావమానములందు, హాని లాభములందు సహనము కలిగియుండుట, ఇంద్రియములను సదా అధర్మకార్యములందు పోకుండ ధర్మకార్యములందు ప్రవేశపెట్టుట, దొంగతనము చేయకుండుట, బాహ్యాభ్యంతర శుచిని గలిగియుండుట, ఇంద్రియములను నిగ్రహించు శక్తికలిగియుండుట, బుద్ధితో నాలోచించి సత్యాసత్యములను గ్రహించగలుగుట, పృథివి మొదలు

పరమేశ్వరుని వరకు గల పదార్థముల యథార్థ జ్ఞానము కలిగియుండుట, సత్యమును పలుకుట, క్రోధమును విడిచిపెట్టుట అను పదిగుణములు కలిగియుండువాడే మానవు డనదగును. వీటిని 'మానవధర్మములు' లేక ధర్మము అని పిలువవచ్చును. ఈ గుణములెంత యెక్కువగా కలిగియున్న నతడంత ధర్మాత్ముడు. ఆ గుణములకెంత దూరమైతే అంత అధర్మాత్ముడు అగును. ఈ పది గుణములు ఏ జాతివారైనా, ఏమతము వారైనా, ఏ సంప్రదాయమునకు చెందినవారైనా స్వీకరించుటలో ఏ ఆపత్తి యుండదు. ఇవి స్త్రీలు, పురుషులు, మానవమాత్రులందరు అనుసరించదగినవి. వీటినే ధర్మముగా అంగీకరించిన నాడు నేడు లోకములో నెలకొనియున్న సమస్త సంకుచిత జాతి, మత, వర్గ, సాంప్రదాయకలహములు సమసిపోయి సర్వ మానవసౌభ్రాతృత్వము నెలకొనును. మానవ జీవితము ఆనందప్రదమగును. కనుక ఈ గుణములను వివరముగా తెలిసికొని వాటిని మన మెక్కువగా కలిగియుండుటకు ప్రయత్నించుటయే ధర్మమగును. కనుక వీటిని గురించి వివరముగా ఆలోచింతము.

**ధారణాద్ ధర్మమిత్యాహుర్ ధర్మేణ విధృతాః ప్రజాః ।**
**యః స్యాద్ ధారణ సంయుక్తః సధర్మ ఇతి నిశ్చయః ॥**

**(మహభారతం, శాంతి ప. 109-11)**

ధరించ తగినది గాన 'ధర్మ' మని చెప్పబడినది. ధర్మమే ప్రజలను చక్కగా ధరించి యున్నది. అందుచే దేనివల్ల ప్రజల పాలన పోషణలు జరుగునో అదియే ధర్మము. ఇది ధర్మవేత్తల నిర్ణయము.

# ధృతి : (ధైర్యము)

"ధృతి" అనగా ధైర్యము అని సామాన్య అర్థము. ఒక విషయమును గ్రహించి దానిని గురించి ఆలోచించి, ఒక నిర్ణయము గైకొని నెరవేర్చు స్థైర్య ధైర్యములను కలిగియుండుట, ఆ సంకల్పము దృఢముగా నుండుట, నిర్భయముగా ఆచరించుట ధృతి యనబడును. ఇది మానవులలో మాత్రమే ఉండును. మిగిలిన ప్రాణులలో ఉండదు. ఇదే మానవుడు ముందుగా కలిగియుండలసిన లక్షణము. దీనినే శ్రీకృష్ణుడు భగవద్గీతలో దైవీ సంపదలోని మొదటి గుణముగా "అభయం" అని చెప్పియుండెను. ఈ నిర్భయత్వము వలననే మానవుడు ప్రకృతికి దాస్యముచేయక దానిని తన వశము చేసికొనుటకు ప్రయత్నించును. తత్ఫలితముగా విజ్ఞానము శరవేగమున పయనించును. కాని, జంతువు లట్లుగాక ప్రకృతికి దాస్యము జేయుచుండును

ఈ విషయమున నొక ప్రాచీన కథ కలదు - పూర్వ మొకానొక యరణ్యమున ననేక మృగములు నివసించుచు చక్కగా కాలక్షేపము చేయుచుండెను. ఒకనాడు నక్క కొక దానికి ఆకస్మికముగా నొక యాలోచన వచ్చెను. "విశ్వమున బ్రహ్మదేవుడు ఎనుబది నాలుగు లక్షల జీవరాసులను సృజింప, నొక్క మానవుడే ప్రాణులందరిలోను గొప్పవాడుగా ఏల పేర్కొనబడు చున్నాడు ? బలములోగాని, ఆకారములోగాని, ఆహారము తినుటలో గాని, యుక్తిలోగాని మానవుని మించిన శక్తియుక్తులుగల ప్రాణికోట్లు ఎన్నియో యుండ మానవుడే గొప్పయని శాస్త్రములు ఘోషించుట అన్యాయము. అది కేవలము పక్షపాతమే యగును. కావున నిజానిజములు తెలియవలెను. మానవుని యాధిక్యతను నేనిప్పుడు "సవాలు చేయుదును" అని నిశ్చయించుకొని తన ఆలోచనను అరణ్యమంతయు దిరిగి, ప్రతిమృగమునకు దెలిపి, వానిని రెచ్చగొట్టి, వానికి రోషము తెప్పించి ఒకచోట సమావేశపరచెను. ఒక మహర్షిని ఆ సభకు అధ్యక్షత వహించవలసినదిగా గోరెను. ఆ మహర్షి అధ్యక్షతలో మృగములన్నియు వాటి బలపరాక్రమములను గొప్పగా చెప్పుకొనెను. చివరగా ఏనుగు లేచి "మహాత్మా ! నా బలములో నూరవవంతైనను మనుష్యునకు లేదు. ఆకారము చూచెద మన్నను నా మోకాలివరకు నత డుండును. అట్టి

మానవుడు గొప్పవా డేల యగును ?" అని పలికెను. మహర్షి వాని వాదము లన్నిటిని ప్రశాంతముగా నాలకించి తుదకిట్లు పలికెను. "ఓ మృగసత్తములారా! మీరు చెప్పినదంతయు పరమసత్యము. మీమీ శక్తులముందు మానవుడు గణనకేరాడు. కాని ఒక్క విషయములో మాత్రము మానవుడు మిక్కిలి యధికుడు. తా నాలోచించి ధైర్యముతో మిమ్మందరిని వశములో పెట్టుకోగల ధైర్య మతని కున్నది. మీవలన తాత్కాలిక భయము కలిగినను ధైర్యముతో మిమ్ముల నెదిరించి నిలబడగలడు. అందుచే మానవుడు గొప్పయని శాస్త్రములు ఘోషించుచున్నవి." ఈ మాటలను వినినతక్షణమే నక్కలేచి "మహానుభావా! ధైర్యములేకపోయినచో మానవుని స్థాన మేది ?" అని యడిగెను. దానికి మహర్షి "ధైర్యము లేకపోయినచో మీ అందరికన్న తక్కువ స్థానము కలిగినవాడగును" అని చెప్పెను. అందుకు జంతువులన్నియు "భేష్, భేష్" అని స్తుతించుచు అరణ్యములోనికి పోయినవి.

అందుచే ధైర్యము లేని మానవుడు పశువుకన్నా క్రింది స్థాయికి దిగజారిపోవును. అంతేకాక, ధైర్యములేనిచో మిగిలిన సద్గుణములుండి కూడా పతితుడగు నవకాశమున్నది. భయపడి అసత్యము పలుకవచ్చును. భయపడి దొంగతనము చేయవచ్చును. ఇట్లు ధైర్యము లేనివాడు ఎవరి బలాత్కారముతోనైనా పతితుడయ్యే ప్రమాదము కలదు. అందుచే శాస్త్రములు ధర్మమునకు ధైర్యము మొదటి లక్షణముగా పేర్కొనుట జరిగినది.

స్వామి రామతీర్థుడు నిర్భయత్వాన్ని గూర్చి తన యనుభవములను తన యుపన్యాసములలో నీ విధముగా జెప్పుచుండెడివారు - "నేను హిమాలయ పర్వత ప్రాంతారణ్యములలో సంచరించితిని. నాకు సింహములు, పులులు నెదురయ్యేడివి. కాని నాకవి హానిచేయక ప్రక్కకు తొలగెడివి. నేను కేవలము వానివైపు నిర్భయముగా తేరిపార చూచెడివాడను. ఎలుగుగొడ్లు, శివంగులు మొదలగు క్రూరజంతువులు నాపైకి ఉరికివచ్చియు నా చూపుల వేడిమికి తాళలేక తోకలు ముడుచుకొనెడివి. ఒకనికి సాధ్యమైనది మరియొకనికి అసాధ్యము కాజాలదు. మీరుకూడా ప్రయత్నించి యీ ధైర్యవృత్తిని నవలంబించి నిర్భయులు కండు" అని ప్రబోధించెడివారు.

మహర్షి దయానందుడు అరణ్యములలో సంచరించుచున్నప్పుడు, ఒక ఎలుగుగొడ్డు ఆయనపైకి లంఘించగా ధైర్యముగా నిలబడి చెయ్యి పైకెత్తగానే అది భయపడి అరణ్యములోనికి పారిపోయెను.ఇట్టి ఉదాహరణములు వారి చరిత్రయందు కోకొల్లలు.

మహర్షి దయానందుడు జోధపూర్‌లో నున్నపుడు భ్రమణము చేయుటకై తెల్లవారుఝామున క్రూర మృగములు సంచరించెడు రాతానాడా కొండపైకి వెళ్ళుచుండెడివాడు. అక్కడనే సంధ్యోపాసన ధ్యానాదులు చేసుకొనెడివాడు. ఇది గమనించిన మహారాజు స్వామీజీ రక్షణకై ఏర్పాట్లుచేయ ప్రయత్నించెను. కాని, స్వామీజీ అందుకు ఎంతమాత్రము అంగీకరించలేదు. సర్వప్రాణి సంరక్షకుడైన పరమాత్మయే నన్ను రక్షించగలడని, మీ రక్షణ నా కవసరము లేదని మహారాజుతో పలికెను.

మహర్షి క్రూర మృగములకే కాదు క్రూర మానవులకు కూడ భయపడెడివారుకారు. వందల వేలమంది తనపై దౌర్జన్యము చేయుటకై ఎదుట నిలిచినను నిర్భయముగా అన్నిమతములలోని మూఢనమ్మకాలను, కురీతులను ఖండించెడివారు. రాజులు మహారాజులైనప్పటికి వారిలోని వ్యసనములను కఠోరముగా ఖండించెడివారు. ఒకరోజు జోధపూర్ మహారాజు నన్హీజాన్ అను వేశ్యతో నుండుట మహర్షి చూచెను. వెంటనే ఆయన సింహగర్జనతో 'ఓ రాజా ! సింహముయొక్క పీఠముపై కుక్కల రాజ్యమా! ఈ కుక్కలకు కుక్కలే జన్మించు'నని నిర్భయముగా పలికెను. క్రైస్తవుల పాలనలో క్రైస్తవాధికారుల యెదుటనే క్రైస్తవ మతములోని (బైబిల్ లోని) దోషములను, వారి మూఢ నమ్మకాలను హేతుబద్ధముగా ఖండించెడివారు. క్రీ.సం. 1873 ప్రాంతములో భారతదేశమునకు కలకత్తా నగరము రాజధానిగ నుండెడిది. ఒకసారి వైస్రాయ్ లార్డు బిషప్‌కు స్వామీజీకి వార్తాలాపము జరిగినది ఆ సందర్భమున మా ఆంగ్లేయ శాసనము వలన మీ దేశమునకు కలుగుచున్న ఆనకట్టలు, రైళ్ళు, తంతి తపాలాదులు మొదలగు ఉపకారములను గూర్చి కూడ మీ ఉపన్యాసములలో ప్రచారము చేయుడని వైస్రాయ్ కోరెను. అందుకు స్వామీజీ నిర్భయముగా నేనట్లు చేయలేనని నిరాకరించుటయే గాక

"శ్రీమాన్‌జీ! ఈశ్వరుని కృపవలన మా దేశమునకు విదేశీయుల దాస్యమునుండి శీఘ్రముగా ముక్తి లభింపవలెనని కోరుకొనుచున్నాను. పూర్ణస్వాతంత్ర్యమును బొంది రాజనైతికోన్నతి, ప్రపంచదేశములతో సమానత మాకు లభించవలెనని ప్రతినిత్యము ఉదయ సాయంకాలములలో భగవంతుని మిక్కిలిగా ప్రార్థింతునని నిర్భయముగా పలికెను. ఎంతటి ధైర్యము ! ఈ మాటలు విన్న వైస్రాయి ఒక్కసారిగా ఖిన్నుడైపోయెను. ఆ ప్రసంగము నంతటితో నాపివేసి వెంటనే 'ఈ విద్రోహి సంన్యాసిపై ఒక దృష్టి నుంచుట, అత్యావశ్యకమని ఇంగ్లాండునకు వార్తపంపెను.

కాశీ శాస్త్రార్థములో, హరిద్వార్ కుంభమేళాలో అవైదిక సాంప్రదాయములను ఖండించుచు తానొక్కడైనను వేలాదిమంది పండితులతో శాస్త్రార్థము చేసెను. ఆ ధైర్యసాహసములను వర్ణించుటకు విద్వాంసులకే మాటలు చాలలేదు. మరి, నే నెంతటివాడను.

పావురమునకు పిల్లియన్న చాలభయము. పిల్లిసద్దు వినగానే పాపము పావురము కనులు మూసికొని పిల్లికి గనపడకుండా దాగితినని భ్రమపడును. పిల్లి వెంటనే దానిని చంపి భక్షించును. తాను ఎగురగల శక్తిని గలిగియున్నను భయముచే కళ్ళు మూసికొని ఆత్మవంచన జేసికొని యాహుతి యగును. కావున పిఱికివానిని పిల్లికూడ చంపగలదు. ధైర్యశాలిని చూచి పులులు కూడ బెదురును. మన నిత్యజీవితములో ధైర్యములేనిది సామాన్య కార్యములు కూడ నెరవేరుట కష్టము. ఒక పాత్రలో నుండి మరియొక చిన్న మూతిగల పాత్రలోనికి పాలు పోయవలెనన్న భీరువు కొన్ని పాలైనను క్రిందపోయును. ధైర్యవంతుడు ఒక్కబొట్టు అయినను క్రిందపడకుండ పోయగలడు.

ఒక ఇతిహాసమును వినుడు - పాంచాలదేశపు సిపాయి యొకడు ఓడపై ప్రయాణము చేయుచుండెను. కొన్ని దినముల కతని కొక వ్యాధి కలిగెను. ఆ ఓడపైనున్న ఒక వైద్యుడు అతనిని పరీక్షించి యిది యంటువ్యాధి, ఈ రోగము ఓడలోన్న మిగిలినవారికికూడ రావచ్చును. కనుక వెంటనే ఈతనిని సముద్రములో బడద్రోయవలెనని యాజ్ఞాపించెను. సిపాయి ఈ వార్తను వినగానే రౌద్రమూర్తియై పడకను విడిచి తుపాకిని చేబూని

వైద్యుడున్న గదిలోనికి వెళ్ళి వాని ఛాతికి తుపాకిని గురిపెట్టి "నా కంటువ్యాధి కలిగెనా? నీకు వ్యాధి పరిశీలన తెలియునా? కాచుకొనుము. ఇదే గుండు దెబ్బ" అనగానే వైద్యుడు భయపడి అతడు పూర్ణ ఆరోగ్యవంతుడైనాడని ప్రమాణ పత్రము వ్రాసి యిచ్చెనట.

వివేకానందుడు తన ప్రసంగములలో పలుమార్లు నిర్భయత్వమును గురించి ఉపన్యసించుచుండెడివాడు. ఆయన దృష్టిలో ఉపనిషత్తుల, శాస్త్రముల సారాంశమంతయు "Fearlessness" - 'అభయం' అని ఒక్కమాటలో చెప్పవచ్చును.

"If there is one word that you find coming out like a bomb from the Upanishads, bursting like a bomb-shell upon the masses of ignorance, it is the word 'FEARLESSNESS" and the only religion that ought to be taught is the religion of fearlessness. It is fear that brings misery, fear that brings death ; fear that breeds evil and what causes fear ? Ignorance of our own nature "

"ఉపనిషత్తులనుండి 'బాంబు' వలె వినిర్గతమై అజ్ఞాన జనసందోహ మధ్యమున పడి వారి అజ్ఞానమును ప్రేల్చివేయునట్టి పద మేదైన ఉన్నచో నది 'నిర్భయత్వమే' యై యున్నది. నిర్భయత్వమతమే యిపుడు చాటదగిన ఏకైక మతము. భయమే దుఃఖమును గలుగజేయును. భయమే చావును దెచ్చును. భయమే దోషములను సృజించును. ఇట్టి భయము దేనివలన గలుగుచున్నది. మన శక్తి స్వరూపమును మనము మఱచి నందువలననే" అని వివేకానంద స్వామి లోకమునకు నెలుగెత్తి చాటెను.

ఈ శరీరమే నేను అనుకొనుటవలనమనకు కొన్ని భయములు గలుగును. "ఈ శరీరము నేను గాను. ఈ శరీరము సజీవముగా ఉంచు ఆత్మను నేను" అను భావన స్థిరపడినవానికి భయముండదు. ధైర్యము కలుగును. అంతేకాక, "ప్రకృతితో బోరాడుటయే మానవుని మానవ నామార్హు నొనర్చుచున్నది." అన్న వివేకానందుని పలుకులు సదా మననము చేయదగనవి. అట్టి పోరాట ప్రవృత్తియే 'ధృతి' యనబడును.

బాహ్య పోరాటము చేయబోవు ముందు మన ఇంద్రియములపై, మనస్సుపై పోరాటము చేయవలసియుండును. ధైర్యవంతుడే కామ క్రోధలోభ మోహ మద మాత్సర్యాది దోషములతో కలుషితమైయున్న మనస్సును సంస్కరించుకొన ప్రయత్నించగలడు. బలమైన వ్యసనముల బంధనముల నుండి బయటపడగలడు. అప్పుడే లోకమున మహత్కార్యములచేయ సమర్థుడగును. ధీరులే-ధైర్యవంతులే మహత్కార్యములు సాధింతురు. నిందాస్తుతులను, మానావమానములను, హాని లాభములను లెక్కించక న్యాయ మార్గమున నడుతురు. ఈ సందర్భమున భర్తృహరి నీతి శ్లోకము మననము చేయదగినది.

**శ్లో॥ నిందంతు నీతి నిపుణా యదివా స్తువన్తు,**
**లక్ష్మీః సమావిశతు గచ్ఛతు వా యథేష్టమ్ ।**
**అద్యైవ వా మరణ మస్తు యుగాన్తరే వా,**
**న్యాయ్యాత్పథః ప్రవిచలన్తి పదం న ధీరా ః ॥**

లోకులు నిందించినను లేక ప్రశంసించినను, ధనము ప్రాప్తించినను లేక ధన నష్టమైనను, నేడే మృత్యు వెదురైనను న్యాయపథమున నడుచు ధీరుడు న్యాయ మార్గము నెన్నడును విడువడు.

కొందరు చెడు పనులను కూడ ధైర్యసాహసములతో చేయుచుందురు. అట్టి దానిని ధృతి యనవచ్చునా ? అను విషయమునుగూడ నాలోచింపవలసి యున్నది. శ్రీకృష్ణుడు గుణభేదమును బట్టి ధృతి మూడు రకములుగా నుండునని తెలిపెను. ఏ ధృతిఆధారమున మనస్సును, ప్రాణములను, ఇంద్రియ క్రియలను ఏమరక తన వశములో నుంచుకొని ఫలాపేక్ష రహితముగా సత్కర్మలు ఆచరింపబడునో అది సాత్త్విక ధృతి. ఏ ధైర్యముతో ఫలాకాంక్షను మనస్సునందిడుకొని ధర్మార్థకామ మోక్షములను సాధించ పూర్ణపురుషార్థము చేయబడునో అది రాజసిక ధృతి. ఏ ధృతి కారణమున మానవుడు నిద్రను (సోమరితనమును), అనేక రకముల భయములను, శోక విషాదములను (కష్టములను), అభిమానమును నిజ జీవితములో విడిచిపెట్టలేక వాటితో సతమతమగుచుండునో అది తామస ధృతి. (గీ. 18, 33, 34, 35) కష్టాలను, విపత్తులను ఎదుర్కోవడానికి ధైర్యం అనివార్యం. అట్లే అపజయాన్ని కూడా

ప్రశాంతంగా ఎదుర్కోవడమే ధైర్యానికి గొప్ప పరీక్ష.

ఇక సామాన్య దృష్టితో చూచినను ఎలుకకు, పిల్లికి భయపడు వానిని చూచిన లోకు లేమందురు ? అల్పజంతువులకే భయపడు నీవు మనిషివా ? పశువువా? అని గేలి చేయరా !

అందుచే ఈ ధైర్య ప్రవృత్తిని మనము ప్రయత్న పూర్వకముగా పెంచుకొనవలెను. మనమెంతగా ధైర్యవంతుల మగుదుమో యంతగా ధర్మాత్ముల మగుదుము. అంతగా మానవత్వము కలిగినవార మగుదుము. ఇదే మానవుడు ధారణ చేయవలసిన మొట్టమొదటి గుణము.

# ధృతి శీలో భవ - ఏక పదీ భవ

**శుక్రో ౽సి భ్రాజో౽సి స్వరసి జ్యోతిరసి ।**
**ఆప్నుహి శ్రేయాంసమతి సమం క్రామ ॥ (అథర్వ 2-11-5)**

ఓ నరుడా ! నీవు శుక్రుడవు (శక్తి మంతుడవు). తేజస్వివి. ఆనందమయ పరమేశ్వర యుక్తుడవు. జ్యోతిష్మంతుడవు. నిన్ను నీవు తెలుసుకో. నీకన్న శ్రేష్ఠులను చేరుకో ప్రయత్నించు. నీ సమానులకంటె ముందుకు నడు. ఉన్నతిని సాధించు.

# క్షమము

'క్షమ' అనగా అపకారము చేసిన వ్యక్తి తదుపరి పశ్చాత్తాపము నొంది తిరిగివచ్చి క్షమించుమని కోరిన ప్రతీకారము చేయక క్షమించి విడిచిపెట్టుట, మనస్సులో కూడా అతనిపై ఎట్టి ద్వేషభావము లేకుండుట యని అర్థము. మనపట్ల ఎవరైనా అపరాధము చేసినప్పుడు మనకు క్రోధము కలుగుట సహజము. ఆ అపరాధి తరువాత పశ్చాత్తాపము నొంది క్షమింపగోరిన క్షమింపవలయును. లేకున్న నధర్మమగును. ఈ క్షమాశీలత మానవులకు మాత్రమే ఉండును. ఇది జంతువులలో కానరాదు. జంతువులు తమకు ఆగ్రహము కలిగిన పోరాటములో తాము జయించుటయో, నశించుటయో జరుగునే గాని పశ్చాత్తాపము జెందుట, క్షమించుట ఉండవు. వాటికి అట్టి మానసిక పరిపక్వత లేదు. మానవునిలో క్షమత లేకున్న పశుతుల్యుడగును. అందుచేత లోకవ్యవహారములో పశ్చాత్తాపము జెందిన వ్యక్తిని క్షమింపక ఆగ్రహించి అతనికి అపకారము జేసినచో లోకులు 'నీవు మనిషివా? పశువువా?' యని నిందింతురు. దీనినిబట్టి మానవత్వమునకు క్షమత కూడా ఒక ముఖ్యగుణమని తెలియుచున్నది. అయితే అపరాధిని జయించలేకనో, శిక్షించలేకనో శక్తిచాలని వాడు ఉదాసీనుడగుట క్షమతగాదు. **'సత్యపి సమర్థే అపకార సహనం క్షమా'** తాను శక్తి కలిగియుండియు, అపరాధిని క్షమించుటయే నిజమైన క్షమత. ఈ సందర్భమున వివేకానందుని యీ మాటలు గుర్తుంచుకొనవలయును. "అలసట చేతనో, యశక్తతచేతనో క్షమ చూపుటకంటె బోరాడుటయే మేలు. దేవతాసైన్యములను సైత మవలీలగా జయింప గలుగుదువేని క్షమ చూపుము."

అయితే అపరాధిలో నిజమైన పశ్చాత్తాపము కలిగినప్పుడే క్షమించవలెను. లేకున్న, క్షమించుట మంచికాదు. కపటముగా పశ్చాత్తాపము కనబరచిన తగిన విధముగా దండించుటయే మేలు. ముఖ్యముగా రాజనీతిలో క్షమకన్న న్యాయమునకే ఎక్కువ ప్రాధాన్యత ఉండును. లేకున్న ప్రజలను పాలించుట కష్టమగును. దోపిడీలు, దొంగతనాలు, దురాగతాలు, ఎక్కువైపోవును. అందుచేతనే మహర్షి మనువు -

శ్లో॥ స రాజా పురుషో దండస్స నేతా శాసితా చ సః ।
చతుర్ణామాశ్రమాణాం చ ధర్మస్య ప్రతిభూ : స్మృత : ॥
శ్లో॥ దండశ్శాస్తి ప్రజా స్సర్వా దండఏవాభి రక్షతి ।
దండస్సుప్తేషు జాగర్తి దండం ధర్మం విదుర్బుధా : ॥
శ్లో॥ సమీక్ష్య స ధృతస్సమ్యక్ సర్వా రంజయతి ప్రజా : ।
అసమీక్ష్య ప్రణీతస్తు వినాశయతి సర్వత : ॥

**(మనుస్మృతి అ - 7 - శ్లో 17, 18, 19)**

యథార్థముగా దండమే (న్యాయముగా దండించుటయే) రాజ్యమునకు రాజు. అదియే ప్రజలను శాసించి నడిపించు నాయకుడు. నాలుగు ఆశ్రమములలోను దండమే ధర్మమునకు ప్రతిరూపమై ఉండును. అది శాసించుటయే గాక ప్రజలను రక్షించును. ప్రజలంతా నిద్రించుచున్నను దండముమేల్కొని కాపాడుచుండును. అందుచేతనే బుద్ధిమంతులు దండమునే ధర్మముగా చెప్పుదురు. కాని, ఆ దండము సరిగా నాలోచించి న్యాయముగా ప్రయోగింపబడినప్పుడే ప్రజలంతా సుఖింతురు. గుడ్డిగా, అనాలోచితముగా, అన్యాయముగా ప్రయోగించిన దండము - దండన రాజును రాజ్యమును సర్వనాశము చేయును. ప్రజలంతా పెక్కు కష్టములకు లోనగుదురు.

ఈ సందర్భముననే మను మహర్షి దండము ఎటువంటి ధర్మాత్ముని చేతిలో నుండవలెనో కూడా వివరించెను. ముఖ్యముగా శత్రువును దండింపక - సంహరింపక క్షమించి విడిచిపెట్టినచో గొప్పనష్టమే జరుగును. ఇందుకు నిదర్శనములు మన దేశ చరిత్రలోనే కోకొల్లలు. రత్నాలు రాశులుగా పోసి అమ్మిన మనదేశము నేడు అప్పులరాశులలో మునిగియుండుటకు కారణము మహ్మద్ గజనీ, ఘోరీలవంటి దోపిడిగాండ్రను క్షమించి విడిచిపెట్టుటయే. దీనికి తోడు అనేక సందర్భములలో మొగలుల, ఆంగ్లేయుల దుష్టతను సహించి (క్షమించి) మిన్నకుండుటకూడ కారణమే. తర్వాత నేటి ప్రజాస్వామ్యమునందు కూడ మానవతా వాదము పేరుతో ఉరికంబము నెక్కించక క్షమించి విడిచిపెట్టుట ధర్మము కాదు. ఏలన, ఒకనినిక్షమించి విడిచిపెట్టి అనేకమందికి బాధలను కల్గించుట ధర్మ మెట్లగును? అంతేగాక, అది మరికొందరి దుష్టతకు ప్రోత్సాహమిచ్చినట్లే యగును.

'క్షమ' అను పదమునకు సహనమని మరియొక అర్థము చెప్పవచ్చును. కష్టములు కలిగినపుడు వికలము జెందక ఓర్పుతో తన కర్తవ్యమును నెరవేర్చుట క్షమత యనవచ్చును. ఇంతేకాక, క్షమకు శమము అని కూడ అర్థము చెప్పవచ్చును. శమ మనగా నంతరింద్రియమైన మనస్సును నిగ్రహించుట అని అర్థము. మహర్షి దయానందుడు ఈ పదమున కర్థము వ్రాయుచు 'నిందాస్తుతి, మానావమాన, హాని లాభాదులందును సహన శీలుడైయుండుట' యని వివరించెను. దీనివలన స్థితప్రజ్ఞత గలుగును. తద్ద్వారా ఆత్మ పరమాత్మల సాక్షాత్కారము గలుగును. ఆ యనుభూతి మాటలలో వర్ణింప నలవికానిది. అట్టి యోగ్యత మానవునకు మాత్రమే యున్నది. అందుచే ఈ క్షమాగుణమును మనము ప్రయత్న పూర్వకముగా బెంచుకొనవలయును. ఎంతగా ఈ క్షమాగుణము అభివృద్ధి చెందునో అంతగా మనము ధర్మాత్ముల మగుదుము. ఎంతగా దీనికి దూరమగుదుమో అంతగా మనము అధర్మము వైపు పయనించినవార మగుదుము. మహర్షి దయానందుని జీవిత చరిత్రను పరిశీలించిన అతనొక మూర్తీభవించిన క్షమాదేవతగా కాననగును.

ఎవరెంతగా అవమానించినను, నిందించినను రాళ్ళతో, చెప్పులతో కొట్టి హింసించినను ప్రతీకార మొనర్పక, అవి అజ్ఞానములో నున్న బాలుర చేష్టలుగా భావించి సహించెను. చంపవచ్చిన దుష్టులను పరాజితుల జేసియు ప్రతీకారమొనర్పక విడిచిపెట్టెను. విషప్రయోగము చేసిన దుష్టులను కొట్టి కారాగారమునందు బంధించినను వారిని విడిపించెను. " నేను ఎవరిని బంధనములో వేయుటకు రాలేదు. అందరిని బంధనముల నుండి విడిపించుటకే వచ్చితి" నని అధికారులకు నచ్చచెప్పిన క్షమామూర్తి. చివరికి అతి భయంకరమైన పాషాణవిషమును పాలలో కలిపిత్రాగించిన వంట మనిషి పశ్చాత్తాపమునొందుటగాంచి అతని హృదయం కరిగిపోయినది. నేను విడిచినను రాజ దండన విడువదని గ్రహించి వంటమనిషియైన జగన్నాథునకు తన వద్ద ఉన్న రూప్యము లొసగి దేశమును విడిచి పారిపొమ్మని సలహానిచ్చి సాగనంపెను. అట్టి క్షమాశీలత కలిగియుండువారు చాలా అరుదు.

## క్షమావాన్ భవ - ద్వీపదీ భవ

# దమము

సామాన్యముగా శమ మనగా అంతరింద్రియమైన మనోనిగ్రహమనియు, దమ మనగా బాహ్యేంద్రియ నిగ్రహమనియు అర్థము చెప్పుదురు. కానీ ఈ శ్లోకముననే "ఇంద్రియ నిగ్రహము" విడిగా చెప్పబడుటచే ఈ 'దమ' పదమునకు బాహ్యేంద్రియములకు మూలమైన అంతరింద్రియమైన మనో నిగ్రహమని అర్థము చెప్పుకొనుట సమంజసముగా నుండును.

'దమ' మనగా మనస్సును దమనము చేసి - అదుపులోనుంచుకొని సదా ధర్మమందే ప్రవృత్తపరచి యధర్మమునుండి నిరోధించుట. అనగా అధర్మమొనర్చు నిచ్ఛగూడ పుట్టకుండ జేయుట. మానవునిలో మాత్రమే ఈ యోగ్యత కలదు. జంతువులట్లు గాక, వాటి స్వాభావిక గుణములనుండి అవి మరలలేవు. కాని మానవుడు జన్మజన్మాంతరములనుండి వచ్చు చెడు సంస్కారములనుండి - ఆలోచనలనుండి మనస్సును నిరోధింప గలడు. విషయ వాసనలవలన ఇంద్రియములద్వారా ఇంద్రియార్థములైన శబ్ద, స్పర్శ, రూప రస గంధములను అనుభవింపవలయునను కోరిక గలుగుచుండును. ఆ కోరికను మానవుడు అదుపులో పెట్టుకోగలడు. ఆ వస్తువు తనది కానప్పుడు, ఆ కార్యము అధర్మమైనప్పుడు, ప్రారంభములో సుఖము కలిగినను తదుపరి దుఃఖములు వచ్చునప్పుడు ఆ కోరికలను అణచి పెట్టుకోవలెను. దీనినే 'దమ' మందురు. ఇట్టి దమన గుణము లేని మానవుడు ధర్మాధర్మములను విచారింపక జంతువులవలె మనసునకు బానిసయై అనేక జన్మ జన్మాంతరముల నుండి వచ్చుచున్న విషయవాసనల వెంట పరుగులెత్తును. అట్టి వానిని చూచి ప్రజలు నీవు మనిషివా ? పశువువా? అని నిందింతురు. కేవలము బాహ్యేంద్రియములను మాత్రమే నిగ్రహించుచు మనస్సులో గలుగు ఈ కోరికలను నిగ్రహింపకున్న ఎప్పుడో ఒకప్పుడు పతితుడగు ప్రమాదము గలదు. ఈవిషయమును భగవద్గీతలో శ్రీకృష్ణుడు చక్కగా వివరించెను - "విషయములను చింతించుచుండుటవలన మనుష్యునకు వానియందాసక్తి కలుగుచున్నది. ఆసక్తినుండి కామము, కామము నుండి క్రోధము కలుగుచున్నవి. క్రోధమునుండి అవివేకము, అవివేకమునుండి ధర్మస్మృతి

విలోపము కలుగుచున్నవి. ఈ వివేకమే నశించిన మనుజుడు సంపూర్ణముగా చెడిపోవుచున్నాడు" (భగవద్గీత 2-62, 63)

కనుక మనస్సులో నిట్టి చెడు ఆలోచనలే కలుగకుండ నిరోధించవలెను. అనగా నా చెడు ఆలోచనలనుండి మనస్సును ప్రయత్న పూర్వకముగా యుక్తితో మంచి ఆలోచనలవైపు మరల్చవలెను. ఈ దమన శక్తి యెంతగా నభివృద్ధిచెందునో వ్యక్తి అంతగా ధర్మాత్ముడగును. ఎంతగా ఈ గుణము లోపించునో అంతగా నతడు అధర్మమువైపు పయనించును.

మనలో దమనశీలత పెరుగవలెనన్న వివేక వైరాగ్యము లత్యంత ఆవశ్యకము. వివేకమనగా వివేచించి ఏ పదార్థమెట్లున్నదో అట్లే తెలిసికొన గలుగుట. ఆధ్యాత్మికముగా ఆత్మ పరమాత్మలను గురించియు, ఈ ప్రపంచమునకు మూలకారణమైన ప్రకృతిని గురించియు యథార్థముగా - పొరబడక ఉన్నది యున్నట్లుగా తెలిసికొనుటను వివేకమందురు. ఇచ్చట ముఖ్యముగా మనస్సును నిగ్రహించవలసి యున్నది గాన దాని స్వరూపమేదియో తెలిసికొందము. సామాన్య ప్రజలంతా మనస్సులో వాటంతట అవియే ఆలోచనలు, కోరికలు పుట్టుచున్నవని భావింతురు. కాని యథార్థముగా వాటంతట అవి పుట్టుటలేదు. ఏలన మనస్సుకూడా అతి సూక్ష్మ పరమాణువులచే నిర్మించబడిన ప్రాకృతిక పదార్థమే. పృథివీ జలాదులలో జ్ఞానము లేనట్లే మనస్సులో కూడ జ్ఞానము లేదు. అందుచే దానిలో ఎట్టికోరికలును కలుగవు. నడిపించువాడు లేకున్న యంత్రము నడువనట్లే, ఆలోచించు వాడు లేకున్న మనస్సు కూడ ఆలోచించలేదు. అందుచే మనస్సు దానంతట అదిగా ఏ ఆలోచనయు చేయలేదు. మరి, కోరికలను కోరుచున్నది ఎవరు? ఆలోచనలు చేయుచున్నది ఎవరు ? అని వివేచించవలసి యున్నది. ప్రశాంతముగా సూక్ష్మముగా నాలోచించిన కోరుచున్నది, ఆలోచించుచున్నది తానే నని తెలియును. తా ననగా జీవాత్మ. ఇది పరమాణువు కన్నను సూక్ష్మపరిమాణము కలది. శరీరములో హృదయ స్థానములో నిది యుండును. అట్టి జీవునకు మనస్సు ఒక యద్భుత సాధనము. అదే జీవాత్మకు జ్ఞానేంద్రియములతో సంబంధము కలుపుచు జ్ఞానమును కలిగించును. కర్మేంద్రియములతో

సంబంధము కలుపుచు వాటికి కర్మలను చేయు సామర్థ్యమును కలిగించును. ఇది అంతరింద్రియమై మన శరీరములో అంతటా అతివేగముగా సంచరించుచు మనను పురుషార్థము చేయగల - అనగా ప్రయత్నించి సాధించగల ఉత్తమ ప్రాణియైన మానవునిగా తీర్చిదిద్దుచున్నది. ఈ అద్భుత సాధనమైన మన మనస్సుతో కేవలము ఆలోచించుటయేగాక వివేచించి ఒక నిర్ణయమునకు రాగలము. అప్పుడు ఆ మనస్సునకే బుద్ధియని పేరు కలుగును. దానిలోనే మనము మన అనుభవాలను అనుభూతులను దాచుకోగలము. అప్పుడు అది కంప్యూటర్ వంటిదిగానై చిత్త మనబడును. ఈ పనులన్నియు మనస్సు, ఇంద్రియములు, శరీరము అను సాధనములతో చేయుచున్నాము. జీవుడు వాటితో సారూప్యత చెందిపోయి మొత్తము తానే చేయుచున్నానను భావము అతనికి కలుగుచుండును. దీనినే ఆధ్యాత్మిక భాషలో అహంకార మందురు. ఈ అహంకారము కూడ మనస్సులోని ఒక సూక్ష్మతమ అంశమే.

పై వివరణను బట్టి శరీరము వలెనే మనస్సుకూడ జీవునకు ఒక సాధనము. అనగా పనిముట్టు. అది మన స్వాధీనములోనే యున్నది. కాళ్ళు అనే సాధనముతో నడిచినట్లే మనస్సు అను సాధనముతో మనము ఆలోచిస్తున్నాము. అపాయకరమగు ప్రదేశమునకు వెళ్ళకుండ మనము కాళ్ళను నిరోధించినట్లే అపాయకరమగు, అధర్మమగు ఆలోచనలు రాకుండ మనస్సును నిరోధించి సరియైన ధర్మపూర్వకమైన ఆలోచన వైపు మరలించ వచ్చును. అందుచేతనే శ్రీకృష్ణుడు -

**ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్య ః పరం మనః ।**
**మనసస్తు పరాబుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః ॥**
**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్తభ్యాత్మాన మాత్మనా ।**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥**

**(భగవద్గీత అ. 3 - 42, 43)**

ఈ శరీరములో మిగిలిన శరీరావయవముల కన్న ఇంద్రియములు శ్రేష్ఠములు. ఇంద్రియముల కన్న మనస్సు, మనస్సుకన్న బుద్ధి శ్రేష్ఠము. బుద్ధికన్నను వేరుగా శ్రేష్ఠతమమైనది జీవాత్మ. ఇట్టి వివేక బుద్ధితో మనస్సును

తన వశము నందు ఉంచుకొని కామ మనెడి బలమైన శత్రువును సంహరింపుము.(ఇచ్చట కామ మనగా అధర్మ పూర్వకమైన చెడు కోరికలు, ఆలోచనలు మరియు ధర్మ పూర్వకమైన వైనను సకామముతో ఫలితమును - పేరు ప్రతిష్ఠ స్వర్గాదులను ఆశించుచు చేయు ఆలోచనలు, పనులునని యర్థము. ఏలన సకామ కర్మలు ఇప్పుడు కాకున్నను, కాలాంతరమునైనను మనను అధర్మమువైపు ఆకర్షించును. ఇంతేగాక దుఃఖరూప సంసార సాగరమునుండి అవి తరింపచేయజాలవు. (కాని త్రివిధ దుఃఖరూప సంసార సాగరమునుండి విముక్తి మరియు ఈశ్వరానంద ప్రాప్తి మొదలగునవి కోరదగిన కామములే)

దమన శీలత పెరుగుటకు రెండవ సాధనము వైరాగ్యము. వైరాగ్యమనగా ప్రాపంచిక సుఖములపై రాగము లేకుండుట. వాటిని మరల మరల అనుభవించవలెనను కోరిక లేకుండుట. సామాన్యముగా మానవులంతా ప్రాపంచిక సుఖముల వైపే పరుగులెత్తుదురు. కాని, వాటిని ఎంత అనుభవించినను తృప్తికలుగదు. ఇంతేగాక, వాటిని మరల మరల అనుభవించవలెనను రాగము పెరుగుచునే యుండును గాని తరగదు. అగ్నిలో ఆజ్యము (నెయ్యి) పోసినకొలది మంటలు పెరుగుచుండునే గాని చల్లారవు. అట్లే కోరికల ననుభవించుకొలది అవి పెరుగునే కాని తరగవు. వాటిపై విరక్తి కలుగదు (మను. 2-94) అని మన ఋషులు ఎంతగానో పరికించి తెలిపిరి. విషయ సుఖములపై తాత్కాలికముగా విసుగు, విరక్తి కలిగినను కొంతకాలము తదుపరి మరల వాటిని అనుభవించవలెనను కోరికలు కలుగుచునేయుండును (ఆ కోరికలే మరల మరల జన్మలను కలిగించును). అవి ధర్మ పూర్వకమైన సుఖమును, అధర్మయుతమైనచో దుఃఖమును కలిగించును. ఋషులు ధర్మపూర్వకమైన సుఖములో కూడ దుఃఖము దాగియున్నదని చెప్పుదురు.

**పరిణామ తాప సంస్కార** **(యోగదర్శనం1-5)**

వివేకవంతునకు ఈ సర్వప్రాపంచిక సుఖములలోను పరిణామ, తాప, సంస్కార, గుణ విరోధము లను నాలుగు రకముల దుఃఖములు దాగియున్నట్లు

కనబడును. అందుచే యోగికి సర్వసుఖములు దుఃఖములుగానే గోచరించును. కాన వివేకవైరాగ్యములతో మన మనస్సును స్వాధీన పరచుకొని అధార్మికఆలోచనల నుండి నిరోధించుచు అభ్యుదయమును. సాధించవలెను, మనస్సు అంతర్ముఖమగుటకు యత్నించి నిఃశ్రేయస్సును అనగా గొప్ప పరమేశ్వ రానందము ననుభవింపవలెను. అందుకొరకే మనకీ మానవ జన్మలభించినది. దీనిని సాధించలేకున్న మనకు పశువులకు భేదమేమున్నది ?

## దమన శీలో భవ - త్రిపదీ భవ

**యేన కర్మాణ్యపసో మనీషిణో, యజ్ఞేకృణ్వంతి విదథేషు ధీరా :।**
**యదపూర్వం యక్షమంతః ప్రజానామ్, తన్మే మనః**
**శివసంకల్ప మస్తు ॥ (యజు. 34-2)**

ఏ మనస్సుచే మానవులు లోతుగా నాలోచించి కర్మలు చేయుదురో, దేనితో విద్వాంసులు యజ్ఞాది సత్కర్మలను, వీరులు దేశరక్షణకై సంగ్రామాదులను చేయుదురో, ఏది ప్రజలలోపల విలక్షణ గుణములతో పూజింపదగినదై యున్నదో అట్టి నా మనస్సు సదా శుభ సంకల్పములనే చేయును గాక.

# అస్తేయము

'స్తేయ' మనగా దొంగిలించుటయని అర్థము. దొంగతనము చేయకుండుట 'అస్తేయ' మగును. ఒకరి వస్తువును వారి యనుమతిలేకుండ గ్రహించుట దొంగతన మగును. దానితో బాటు వ్యాపారములో జరుగు వివిధ మోసములు - మంచి సరుకు చూపి, యిచ్చునపుడు రెండవ రకము సరుకు ఇచ్చుట, తూనికలలో, కొలతలలో తక్కువ యిచ్చుట , దొంగ లెక్కలు వ్రాయుట, ప్రభుత్వమునకు కట్టవలసిన పన్నులు కట్టకుండుట మొ॥నవి; జీతము తీసుకొని సరిగా పనిచేయకుండుట, పనికి తగిన కూలి లేదా జీతము ఇవ్వకుండుట, తక్కువ ధరకు లభించుచున్నవని దొంగ సరుకులు కొనుట మొదలగునవి ; వేద విరుద్ధ మార్గముచే అనగా కష్టించి పనిచేయక జూదము ద్వారా, లాటరీల ద్వారా, గుఱ్ఱపు పందెముల ద్వారా ధనము పొందవలెనని ఆశించుట - పొందుట, ఇతరుల నుండి ఉపకారమును పొంది మరల వారికి ప్రత్యుపకారము చేయకుండుట. ఈ భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము అను పంచ భూతముల ద్వారా నిత్యము (ప్రతి క్షణము) ప్రయోజనమును బొందుచు నిత్యాగ్నిహోత్రము ద్వారా మరల వాటిని సంస్కరింపకుండుట మొదలగునవి. యుక్తిచే అమాయకులైన రైతులవద్ద, గిరిజనులవద్ద తక్కువ ధరకు వస్తువులు కొని ఎక్కువగా లాభపడుట మొదలగునవి. ఇట్లు ఎన్నో సూక్ష్మమైన దొంగతనము లుండును. వాటినుండి కూడా మానవుడు నివృత్తుడు కావలెను. అట్టి వేదము చెప్పు ధర్మాధర్మములను గూర్చి స్వాధ్యాయ సత్సంగములద్వారా తెలిసికొనుచుండవలెను. ఇంతేగాక, ఛలకపటములచే, విశ్వాసఘాతముచే, యుక్తిచే, వేద విరుద్ధముగ సంపాదించినది కూడ దొంగలింపబడినదే య[illegible] నని మహర్షి దయానందుడు వ్యాఖ్యానించెను.

జంతువులకు ఆ వస్తువు తనదా ? తన యజమానిదా ? లేక ఇతరులదా ? మనము దాని ననుభవింపవచ్చునా ? లేదా ? యను ఆలోచన జేయ గల శక్తి లేదు. కాని, మానవునకు నిట్టి వివేచనచేయగల బుద్ధి గలదు.

అందుచే మానవుడు తనది కాని వస్తువు ననుభవించుట నేరమగును. అట్లు దొంగతనము జేసిన వ్యక్తి మానవత్వమునకు దూరమగును. అధర్మాత్ముడగును. ఇట్టి వివేకము లేని వానిని 'నీవు మనిషివా ? పశువువా ? అని మనము నిందించుచుందుము. మన మహర్షులు కేవలము ఒకరి వస్తువును దొంగిలించుట మాత్రమే 'స్తేయ' మని చెప్పియుండలేదు. అన్యాయార్జన యంతయు స్తేయమనియే చెప్పియుండిరి. దొంగ వ్యాపారముతోగాని, లేదా వేద విరుద్ధమార్గములోగాని యితరులు బాధపడుచుండ తన యవసరమునకు మించి కూడబెట్టుట కూడ స్తేయమే యగును. కనుక మనము ఈ స్తేయ గుణమునకు ఎంతదూరమైన అంత ధర్మాత్ములము, మానవత్వము గలిగిన వారము అగుదుము.

మానవుడు సామాజిక ప్రాణి. ఇతరుల సహకారము లేనిది మన జీవన యాత్ర గడచుట అసంభవము. ఆగర్భ శ్రీమంతునకైనను పరుల సహకారము అవసరమే. అందుచే సమాజములో తనవంతు పనిగా ఏదేని పురుషార్థము చేయవలెను. లేకున్న అదికూడ సామాజిక సహకారమును దొంగిలించుటయే యగును అందుచేతనే 'పనిచేయనివాడు తినుట కనర్హు'డని పెద్దలు చెప్పుదురు. ఈ సూత్రము పైననే ఆధునిక కమ్యూనిజం ఏర్పడినది. ఈశ్వరీయజ్ఞానమైన వేదము ఈ విషయమును మరింత నొక్కి వక్కాణించును.

**మోఘమన్నం విందతే అప్రచేతా : సత్య బ్రవీమి వధ ఇత్సతస్య ।**
**నార్యమణం పుష్యతి నో సఖాయం కేవలాఘో భవతి కేవలాదీ**

**(ఋ. 10-117-6)**

అప్రచేతుడు అనగా సోమరి కష్టించకనే వ్యర్థముగా అన్నమును సుఖభోగములను బొందగోరును. సత్యము చెప్పుచున్నాను. అట్టి సోమరితనము అతని వినాశనమునకు దారితీయును. అతడు మానవ జన్మను నొందియు ఎట్టి ఉన్నతిని సాధించలేడు. ఈ లోకములో తోడుగా నుండుటకు చక్కటి మిత్రులనుగాని, అనుచరులను గాని పొందలేడు, మరియొక విషయము ఏమనగా కష్టించి సంపాదించి పరులకు ఏకొద్దియైన పెట్టక తానొక్కడే తినువాడు కేవలము పాపమునే తినుచున్నాడు.

ఈ వేదాజ్ఞను పాటింపజేయుటకే ఋషులు అనేక యజ్ఞములను నిర్దేశించినారు. అందు అతి ముఖ్యమైనవి ఐదు, వాటినే పంచ మహా యజ్ఞములుగా పేర్కొనిరి అవి ఏవి యనగా -

1. **బ్రహ్మయజ్ఞము** : సమయమంతా సంపాదనలోనే వెచ్చించక ఉదయ సాయంకాలములందు విధిగా సర్వవస్తు ప్రదాతయైన పరమేశ్వరునకు కృతజ్ఞతలు చెప్పుకొనవలెను. అద్భుతమైన ఈ సృష్టిని రచించి, మనకొరకు ఈ ఉత్తమమైన మానవ శరీరమును నిర్మించియిచ్చిన భగవంతుని మరచుట ద్రోహము కాదా ? అందుచే విధిగా వీలైనంత ఎక్కువ సమయము ఉదయ సాయం సంధ్యా సమయములందు ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనలు చేయవలెను. పరమేశ్వరోపదేశమైన వేదమును ఋషులు వ్రాసిన గ్రంథములను స్వాధ్యాయము చేయవలెను.

2. **దేవయజ్ఞము** : ఏ పంచ భూతముల ద్వార మన శరీరము ఏర్పడినదో, ఎందులో జీవించుచున్నామో అట్టి భూ జల అగ్ని వాయువు ఆకాశములను అగ్నిహోత్రము చేసి శుద్ధపరచుకొనవలెను. లేకున్న మన శరీరము ద్వార వెడలు మల, మూత్ర, స్వేద, నిఃశ్వాసాదుల ద్వారా అవి మలినమై మనను మన తోటివారిని అనారోగ్యమునకు గురిచేయును. అందుచేతనే శ్రీకృష్ణుడు గీతలో అగ్నిహోత్రము చేయకుండా భుజించువాడు దొంగయే (భ.గీ.) అని హెచ్చరించెను. మనుస్మృతి (3-119) లో కూడ ఇట్లే చెప్పబడినది. (3-13) ఇంతేగాక ఒకరినుండి మనము ఉపకారమును బొంది తిరిగి వారికి అవసరమైనపుడు మన శక్తికొలది ఉపకారము చేయకున్న అదికూడ దొంగతనముగానే లెక్కించబడునని శ్రీకృష్ణుని అభిప్రాయము. భగవద్గీతలో దేవయజ్ఞమైన అగ్నిహోత్రము వలన కలుగు లాభములను వివరించుచూ -

**ఇష్టాన్ భోగాన్ హి వో దేవా దాస్యంతే యజ్ఞభావితాః ।**
**తైర్దత్తా న ప్రదా యైభ్యో యో భుంక్తే స్తేన ఏవ స ః ॥ (భ.గీ. 3-12)**

యజ్ఞమువలన భావింపబడిన అనగా సంస్కరింపబడిన-శుద్ధము చేయబడిన వాయు జల పృథివ్యాది దేవతలు మీకిష్టమైన శుద్ధమైన వాయు జల అన్నాదులను ఇచ్చును.

**3. పితృయజ్ఞము** : మనకు జన్మనిచ్చి ఎన్నోకష్టములకోర్చి పెంచి పెద్దచేసి విద్యా బుద్ధులను నేర్పిన తల్లి దండ్రులకు ప్రతివ్యక్తి ఋణపడి యుండును. ఆ ఋణము తీరుటకు అవసరమైనపుడు వారికి అన్ని విధముల సేవ చేయవలెను.

**"అనువ్రతః పితుఃపుత్రో "............ (అథర్వ - 3-30-2)**

వారి వ్రతములను అనగా ఆశయాలను, ఆదర్శాలను సత్సాంప్రదాయాలను అనుసరించవలెను. వంశగౌరవమును కాపాడవలెను -

**"ప్రజాతంతుం మావ్యవచ్ఛేత్ సీః"**

అట్లే ఉత్తమ సంతతిని కని, పెంచి ఉత్తమ మానవ జాతిని నిర్మించవలెను.

**4. బలివైశ్వదేవ యజ్ఞము** : బలి అనగా అన్నము అని అర్థము. (అంతేగాని దేవతల పేరిట పశువులను చంపుట కాదు) తన యింట ఉన్న గో అశ్వ శునకాదులకు తగిన ఆహారము పెట్టవలెను.అనాథలకు, ఆకలి పీడితులకు మన శక్తి కొలది ఆహారము పెట్టవలెను.

**5. అతిథి యజ్ఞము** : అతిథులనగా తిథివారములు ముందుగా తెలుపకనే మన యింటికి విచ్చేసి మనకు ధర్మోపదేశము చేయు సాధు సంన్యాసులు. వారిని తగిన విధముగా సత్కరించి భోజనాదుల నొసంగవలెను. ధర్మమునకు చెందిన సందేహములను, కర్తవ్యాకర్తవ్యములను వారిని అడిగి తెలిసికొనవలెను. సామాజిక సమానతకు పై అయిదు యజ్ఞములు అవసరమే. సామాజిక ప్రాణులమైన మనము వీటిని ఆచరింపకున్న పాప భాగుల మగుదుము. అందుచేతనే మహర్షి దయానందుడు తన సత్యార్థప్రకాశములో అస్తేయ పదమునకు అర్థము వ్రాయుచు-అస్తేయము = దొంగతనము చేయకుండుట. అనగా ఆ వస్తువు యొక్క స్వామి ఆజ్ఞలేక కాని, ఛలకపటములచే గాని, నమ్మకద్రోహముచేగాని లేదా మరొక రకమైన మోసముచేగాని వేదోపదేశ విరుద్ధమైన మార్గమునగాని ఇతరుల పదార్థములను గ్రహించుటను దొంగతనముగా నెంచవలెను. ఇట్టి చౌర్యమును పూర్తిగా వదిలిపెట్టుటయే అస్తేయము' అని వివరించిచెప్పెను.

కనుక మనము నిత్యము ఆత్మనిరీక్షణగావించుకొనుచు మనలో ఏవైన స్తేయ భావములు తలెత్తుచున్నవేమో జాగ్రత్తగా పరిశీలించి చూచుకొనవలెను. అట్టి భావములు కనబడిన వెంటనే వాటిని దూరము చేసికొన గట్టి ప్రయత్నము చేయవలెను. అప్పుడే మనము మానవత్వముగల మానవుల మగుదుము. ఇంతేగాక పరమేశ్వరుని చేర్చు యోగ సాధనములో అస్తేయము ఒకటి.

**అస్తేయ ప్రతిష్ఠాయాం సర్వరత్నోపస్థానమ్ (యోగదర్శనం 2-37)**

ఈ అస్తేయమును మనోవాక్కాయములతో పాటించు యోగ సాధకునకు భౌతికముగా కూడ సర్వరత్నములు అనగా ఉత్తమమైన పదార్థము లన్నియు ప్రాప్తించును. ఈశ్వరుని నుండి జ్ఞాన విజ్ఞాన బల ఉత్సాహ ఆనందములు, ప్రజల నుండి అతని జీవనావసర వస్తువులు సర్వము ప్రాప్తించును.

# అస్తేయ వ్రతో భవ - చతుష్పదీ భవ

**పరాఋణా సావీరధ మత్కృతాని, మాహం రాజన్నన్యకృతేన భోజమ్ ।**
**అవ్యుష్టా ఇన్ను భూయసీ రుషాస, ఆనో జీవాన్ వరుణ తాసుశాధి ॥**

ఓ వరుణదేవ ! ప్రపంచ పాలక పరమేశ్వర ! నేను చేసిన ఋణభారముల నుండి నన్ను విముక్తిని జేయుము. నేను ఇతరుల కష్టార్జితమును భుజింప నిచ్ఛగించకుందును గాక. దొంగిలించకుందును గాక. ఇతరులకు ఋణపడి ప్రభాత ఉషస్సుల ఆనందమును పోగొట్టుకొనకుందును గాక.

# శౌచము

'శౌచము' అనగా పరిశుభ్రతయని సామాన్య అర్థము. కేవలము బాహ్య పరిశుభ్రత మాత్రమే కాక మనః పరిశుభ్రత కూడ కలిగినది శౌచమగును. ఈ రెండును మానవునిగా కలిగియుండవలసిన గుణములు. సామాన్యదృష్టితో చూచిన ఏ జంతువు బాహ్యశౌచమును పాటించదు. ఏ జంతువుగూడ మనవలె స్నానముచేయుటగాని, నవరంధ్రములలో నుండి వచ్చు మలములను శుభ్రముచేసికొనుటగాని, పరిసరములను శుభ్రపరచుకొనుటగాని చేయదు. కాని మానవుడు ఈ శౌచమును పాటింపకున్న పశుతుల్యుడగును. అందుచేతనే లోకులు శౌచమును పాటింపని వానిని 'నీవు మనిషివా ? పశువువా?' అని నిందింతురు.

శారీరక శౌచము మానవారోగ్యమున కత్యవసరము. ఈ శౌచమును బాటింపకున్న తొందరలోనే రోగములతో దుఃఖముల పాలగుదుము. శారీరక శౌచముకూడ బాహ్యాభ్యంతరములని రెండు విధములు. ఆంతరిక శారీర మనగా కడుపు, ప్రేగులు, మలమూత్రావయవములు, ఊపిరితిత్తులు, రక్త నాళములు మొదలగునవి. వాటిని కూడ సరియైన ఆహార పానీయాదులతో, వ్యాయామ ప్రాణాయామములతో శుద్ధపరచుకొనవలెను. జంతువులు ప్రకృతితో - పంచభూతములతో సన్నిహితముగా నుండుటచే వాటికి సహజసిద్ధమైన రోగనిరోధక శక్తి యుండును. కనుక అవి శౌచమును పాటింపకున్నను ఆరోగ్యముగా నుండగలవు.

బాహ్యశౌచముతో బాటు అంతఃశౌచము గూడ అత్యవసరము. మానవునకు గలుగు అనేక జబ్బులకు మనసే కారణము. హోమియో వైద్య పితామహుడైన డా॥ హానిమన్ రోగము ముందుగా మనస్సులో ప్రవేశించి తదుపరి శరీరముపైకి ప్రసరించునని చెప్పెను. చెడు ఆలోచనలే 'సోరా' యను రోగకారకతత్వమై అన్ని రోగములకు మూలమగునని ప్రయోగాత్మకముగా నిరూపించెను. కనుక ఆరోగ్యమునకు రాగద్వేషరహితమైన మనసు ఎంతైన అవసరము. శరీర శౌచముతో బాటు మనస్సు, బుద్ధి, జీవాత్మ శుద్ధిని బొందుట యవసరమని శాస్త్రములు చెప్పుచున్నవి. ఇవి వేటివలన శుద్ధమగును? అను

ప్రశ్నకు 'మనువు' సంక్షిప్తముగా చక్కటి సమాధానము చెప్పెను.

**'అద్భిర్గాత్రాణి శుద్ధ్యంతి మన స్సత్యేన శుద్ధ్యతి ।**
**విద్యాతపోభ్యాం భూతాత్మా బుద్ధిర్ జ్ఞానేన శుద్ధ్యతి ॥"**

**(మనుస్మృతి 5-109)**

అనగా శరీరాంగములు నీటితోను, మనస్సు సత్యాచరణమువలన, విద్యా తపస్సులచే జీవాత్మయు, జ్ఞానముచే బుద్ధియు శుద్ధమగునని దీని అర్థము. కనుక బాహ్యశౌచముతో బాటు శరీర మనో బుద్ధులను, జీవాత్మనుగూడ శుద్ధమొనర్చుకొనుట ఎంతో శ్రేష్ఠము. మహా భారతమున నొక సందర్భమున ఇట్లు ఉపదేశించబడినది. -

**శ్లో॥ ఆత్మా నదీ సంయమ పుణ్యతీర్థా సత్యోదకా శీలతటా దయోర్మీ ః ।**
**తత్రాభిషేకం కురు పాండుపుత్ర న వారిణా శుద్ధ్యతి చాంతరాత్మా ॥**

ఓ పాండుపుత్ర ! సంయమ మను పుణ్యతీర్థములో (నదిలో) సత్యమను జలములో, శీల మను తీరముగలిగి దయ అను అలలతో నిండిన ఆత్మలో స్నాన మాచరించిన అంతరాత్మ శుద్ధమగునుగాని సామాన్యమగు జలమునందు కాదు.

'మనువు' ఒక సందర్భమున ధన విషయములో గట్టి శుచిని పాటించువాడు క్రమముగా మిగిలిన విషయములలో గూడ శుచి యగునని చెప్పియుండెను.

**"సర్వేషామేవ శౌచానా మర్థశౌచం పరం స్మృతం ।**
**యోzర్థే శుచిర్హి స శుచిర్ న మృద్వారి శుచి శ్శుచి ః ॥**

**(మనుస్మృతి 5-106)**

శౌచము పాటించుటవలన మరి యొక మహోన్నత లాభము కలుగును. పతంజలి మహర్షి తన యోగదర్శనములో శౌచమువలన కలుగు ప్రయోజనములను వివరించెను. అవి ఏవన -

**'శౌచాత్ స్వాంగ జుగుప్సా పరై రసంసర్గః' (యోగ. ద. 2-40)**

ఈ సూత్ర భావమేమనగా - బాహ్యశౌచము సిద్ధించిన యోగికి ఎంత శుద్ధి చేసినను తన శరీరము నుండి నిరంతరము మలములు వెలువడుచుండుట

జూచి తన శరీరమునందు జుగుప్స - ఏవగింపు కలుగును. ఇతరుల శరీరములుకూడా నట్లేనని వాటి యెడల కూడా ఏవగింపు కలుగును. అది వైరాగ్యమునకు దోహదము చేసి భగవద్భక్తిని పెంచును.

'సత్వ శుద్ధి సౌమన స్యైకాగ్ర్యేంద్రియ
జయాత్మ దర్శన యోగ్యత్వాని చ' (యోగ. ద. 2-41)

అంతరిక శౌచమువలన అనగా మనస్సు, బుద్ధి, సత్వము, శుద్ధమగుటచే సౌమనస్యము, మైత్రి, కరుణ మున్నగునవి కలిగి బుద్ధిసత్వము నిర్మలమగును. ఏకాగ్రత, ఇంద్రియజయశీలత, ఆత్మ దర్శన యోగ్యత యనునవి క్రమముగా కలుగును. ఇంతకన్నా మానవులకు కావలసిన దేమున్నది ? అదే కదా ! మానవ జీవిత లక్ష్యము. మరొకచోట -

శ్లో॥ మనః శౌచం కర్మ శౌచం కుల శౌచం చ భారత ।
శరీర శౌచం వాక్శౌచం శౌచం పంచవిధం స్మృతమ్ ॥

శౌచము ఐదు విధములుగా నుండునని తెలిసికొనవలెను. అవి ఏవనగా- మనస్సునందు పవిత్ర భావములు కలిగియుండుట, శుద్ధమైన కర్మలు చేయుట, కులమునకు (వంశమునకు) అపకీర్తి కలుగకుండ కాపాడుట బాహ్యాభ్యంతర శరీరములను శుద్ధముగా నుంచుకొనుట, వాక్తో సత్యమును, ప్రియమును పలుకుట, యని ఉపదేశించబడెను.

ఈ విధముగా అంతఃకరణ శుచిని పాటింపకున్నను, బాహ్య శౌచమును బాటింపకున్నను తొందరలోనే మానవుడు పశుతుల్యుడగును. ఆంగ్లమున నొక సామెత గలదు. ఆస్తిక్యభావన తదుపరి కలిగియుండవలసినది పరిశుభ్రత. (Cleanliness is next to Godliness). మనమెంతగా శౌచమును బాటింతుమో అంతగా ధర్మాత్ముల మగుదుము. ఎంతగా శౌచమునకు దూరమగుదుమో అంతగా నధర్మమువైపు పయనించినవార మగుదుము.

## శుచి శీలో భవ - పంచపదీ భవ

# ఇంద్రియ నిగ్రహము

'ఇంద్రియ' మనగా జీవునకు సుఖము నిచ్చు గొప్ప విలువైన అవయవమని అర్థము. 'ఇది-ఐశ్వర్యే' యను ధాతువుతో ఇంద్రియ పదము సిద్ధమగును. దీనిని బట్టి ఇంద్రియములు చాల విలువైనవని తెలియుచున్నది. ఏ కారణముచేతనైనా వాటిలో ఏదేని లోపమేర్పడినపుడే వాని విలువ ఎంతయో అర్థమగును. జీవునకు ఇంద్రుడను పేరుకూడ కలదు. జీవునకు సుఖసాధనము లగుటవలన వీనికి ఇంద్రియములని పేరు వచ్చెనని చెప్పవచ్చును. మానవులకు కన్ను, చెవి, ముక్కు , నాలుక, చర్మము అను ఐదు జ్ఞానేంద్రియములు ; కాళ్ళు, చేతులు, వాక్కు, మల, మూత్రావయవములు అను ఐదు కర్మేంద్రియములు పూర్ణవికాసము జెందియుండును. మిగిలిన జీవరాశిలో నేవో కొన్ని ఇంద్రియములు తక్కువగా నుండును. పూర్తిగా పది ఇంద్రియములు వికసించి యుండవు.

సాధారణముగా అందరకూ తెలిసినదే జంతువులకు వాక్కు లేదని. వాటికి ఏవో కొన్ని యఱపులు, కేకలు ఉండునే గాని యొక భావమును వ్యక్తముచేయు భాషను అవి పలుకలేవు. కొన్నిటికి పాదము లుండవు. పొట్టతోనే అవి ప్రాకును (పాము, జలగ మొదలగునవి) చాలా వాటికి చేతు లుండవు. నోటితోనే చేతులపని చేయును. కొన్నిటికి మూత్ర పురీషేంద్రియములు వేరు వేరుగా నుండక ఒకటిగా నుండును. కొన్నిటికి ఇవి రెండును ఉండవు. నోటితోనే ఆ పనుల జేయును(గుడ్లగూబ మొ॥).
కొన్నిటికి కండ్లు ఉండవు. మరొక ఇంద్రియముతో నా పనిని కొంతచేయును. కొన్నిటికి చెవు లుండవు. ఈ విధముగా జంతువులలో ఏవో కొన్ని ఇంద్రియముల లోప ముండును. జంతువులలో వాటికున్న ఇంద్రియములు మనవలె పూర్ణ ప్రయోజనకారిగా నుండవు. మనము కన్నులతో ఏడు రంగులను చూడగలము. కాని జంతువులు ఏవో కొన్ని రంగులను మాత్రమే చూడగలవు. మనము చెవులతో ఎన్నోరకముల శబ్దములను వినగలము. సంగీతాదులను గ్రహించగలము. కాని జంతువుల కర్ణేంద్రియము అంత వికసిత రూపములో నుండదు. మనము రకరకముల వాసనలను గ్రహించగలము. జంతువులలో

ఈ శక్తి పరిమితము. మనము నాలుకతో షడ్రుచులను గ్రహించగలము. జంతువుల కట్టి శక్తి స్వల్పము. చేతులతో కాళ్ళతో ఎన్నోరకముల విన్యాసములు చేయుదుము. ముఖముతో ఎన్నో హావభావములను ప్రదర్శించగలము. ఇట్టి శక్తి జంతువులలో నామమాత్రమే. కొన్ని జంతువులలో మానవుని కన్న విశేషముగ గుణగ్రహణ జేయగల శక్తి ఒకటి, రెండు ఇంద్రియములలో నున్నను అవి కేవలము స్వాభావికమైనవి మాత్రమే. విశేష ప్రయత్నముతో పొందినవికావు. మానవుడు విశేషప్రయత్నముతో ఇంద్రియ శక్తులను వృద్ధిపరచుకొనవచ్చును. అయితే వాటిని నిగ్రహించుకోగల సమర్థత కలిగినపుడే అతడు మానవుడగును.

మానవత్వమున కుండవలసిన ఆరవలక్షణము ఇంద్రియ నిగ్రహము. అనగా ఇంద్రియములను నిగ్రహించగలుగుట. మానవుడు మాత్రమే ఇంద్రియములను నిగ్రహించగలడు. లోకవ్యవహారములో ఇంద్రియములకు ఇంద్రియార్థములతో నిత్యము సంబంధ మేర్పడుచుండును. వాటివలననే మన జీవనయాత్ర జరుగును. వాటిని పూర్తిగా కట్టిపెట్టి మనము జీవించలేము. కనుక ఇంద్రియ నిగ్రహ మనగా ఇంద్రియములను మంచి మార్గమున - మంచి విషయములలో మాత్రమే ప్రవేశపెడుతూ, అధర్మ ప్రవృత్తినుండి నిరోధించుట యని యర్థము. ఇంద్రియములకు అర్థములు తారసిల్లినప్పుడు వాటిని అనుభవించవలెనను కోరిక సహజముగా కలుగును. అందుచేతనే జంతువులు వాటికి రుచికరమైన వస్తువులు కనబడగనే వెంటనే అటువైపు పరుగెత్తి వాటి నందుకొని తినును. మానవుడట్లుగాక తన కిష్టమైన పదార్థము కనబడినపుడు దానిని కొనియో లేక అడిగి తీసికొనియో తినును. ఈ రెండు సాధ్యముకాకున్నను లేక దానివలన తనకు అనారోగ్యము కలుగునను అనుభవము స్ఫురించినను ఆ కోరికను నిరోధించి జిహ్వేంద్రియమును నిగ్రహించును. ఇట్టి నిగ్రహశక్తి లేని యెడల మానవుడు పశుతుల్యుడగును. అందుచే లోకులు ఇంద్రియనిగ్రహము గోల్పోయి యేదైన చెడు కార్యము జేసినయెడల 'నీవు మనిషివా ? పశువువా ?' యని నిందింతురు. కనుక ఇంద్రియనిగ్రహము లేనివాడు మానవు డనతగదు.

ఇంద్రియ నిగ్రహము అనుకున్నంత తేలికయైనది గాదు. విద్వాంసులు, జ్ఞానులు గూడ నొక్కొక్కసారి ఇంద్రియములను నిగ్రహింప అసమర్థులగు చుందురు. అందుచేతనే శ్రీకృష్ణుడు భగవద్గీతలో ఇంద్రియ నిగ్రహము గురించి పలుమార్లు నొక్కి వక్కాణించి యున్నాడు. వాటిని నిగ్రహించుటకు ఎన్నో ఉపాయములు చెప్పియున్నాడు. తాబేలు తనకు ప్రమాదము సంభవించునను భయము కలిగినపుడు తన కాళ్ళను, తలను లోపలకు లాగుకొనునట్లు (ముడుచుకొనునట్లు) అధర్మ విషయములందు తాను కూడ ఇంద్రియములను లాగిపట్టి యుంచవలెనని చెప్పియున్నాడు-(భగవద్గీత 2-58). పూర్వజన్మ వాసనల వలన ఇంద్రియములు విషయముల వైపు పరుగిడుచుండును. వాటిని నిగ్రహించినను వాసనలు మనలను బాధించును - బలాత్కరించుచుండును. కనుక జ్ఞాని అయినవాడు తన యాత్మ స్మృతితోను, భక్తుడు భగవంతునిపై చిత్తము నిల్పుటవలనను వాటి బలాత్కారమునకు వశుడు కాకుండును. అట్టి వివేకి సముద్రములో ఎన్ని నదులు కలిసినను సముద్రము తన అవధి దాటి పొంగి ప్రవహించకుండునట్లు ఎన్ని కోరికలు బలాత్కరించినను వాటి నదుపుజేసికొనగలడు **(భ.గీ. 2-61).**
మను మహారాజు ఇంద్రియముల విషయములో కొన్ని సూచనలు చేసెను.

**శ్లో॥ ఇంద్రియాణాం ప్రసఙ్గేన దోష మృచ్ఛత్యసంశయమ్ ।**
**సంన్నియమ్యే తు తాన్యేవ తతః సిద్ధిం నియచ్ఛతి ॥ (మను. 2-93)**

విషయాసక్తిచే ఇంద్రియములను అధర్మ మార్గమున నడుపుటచే మనుష్యుడు నిశ్చయముగ దోషి యగుచున్నాడు. వానిని జయించి ధర్మ మార్గమున నడుపువారు తమ అభీష్ట సిద్ధులను బొందుదురు.

**న జాతు కామః కామానాముపభోగేన శామ్యతి ।**
**హవిషా కృష్ణర్త్మేవ భూయ ఏవాzభివర్ధతే ॥ (మను - 2-94)**

ఇంధనములను, నేతిని అగ్నిలో వేయుటవలన అగ్ని వర్ధిల్లునట్లే కామములను భోగించుటచేత కామములు వర్ధిల్లునే కాని శాంతింపవు. కాన మనుష్యుడెన్నడును విషయాసక్తుడు కాగూడదు .

ఈ సందర్భముననే జితేంద్రియుడు కాని పురుషుడు విప్రదుష్టుడగు

ననియు, అతనికి వేద జ్ఞానముకాని, త్యాగము కాని, యజ్ఞము కాని, నియమము కాని, ధర్మాచరణముకాని సిద్ధింపదనియు, ఇవి యన్నియు జితేంద్రియులగు ధర్మాత్ములకే సిద్ధించుననియు చెప్పెను.

ఏవో ఒకటి రెండు ఇంద్రియములను వశపరుచుకొన్న సరిపోదు. ఎందుచేత ననగా -

**ఇంద్రియాణాం తు సర్వేషాం యద్యేకం క్షరతీంద్రియమ్ ।**
**తేనాస్య క్షరతి ప్రజ్ఞా దృతేః పాత్రాదివోదకమ్ ॥ (మను 2-99)**

నీటితో నిండిన తోలు సంచికి ఒక రంధ్రమేర్పడినను క్రమముగా సంచిలోని నీరంతయు బయటకు పోవును. అట్లే ఏ ఒక్క ఇంద్రియము నిగ్రహింపబడకున్నను అది బుద్ధినంతటిని నష్టముచేయును.

**పతఙ్గ మాతఙ్గ కురఙ్గ భృఙ్గాః మీనాః హతాః పఞ్చభిరేవ పఞ్చ ।**
**నాఏకః ప్రమాదీ స కథం న హన్యాత్ యః సేవతే పఞ్చభిరేవ పఞ్చ ॥**
**(గరుడ పురాణం)**

"కామ (స్పర్శ) వాసనచే ఏనుగు మానవులకు పట్టుబడును. రూప వాసనచే కీటకము దీపముపైబడి మరణించును. రసవాసనచే చేప గాలమునకు చిక్కుకొని మరణించును. గంధ వాసనచే భ్రమరము కమలములో దీర్ఘకాలము గడపుట వలన సూర్యాస్తమయముకాగానే కమలము ముడుచుకొనుటచే అందు బంధింపబడును. కాన ఏ ఒక ఇంద్రియమునకు దాసుడైనను దుర్గతిబొందు నవకాశము కలదు. అందుచేత ఇంద్రియములను నిగ్రహించుట అవసరమని ఋషుల అభిమతము.

ఇంద్రియ నిగ్రహమునకు వివేకజ్ఞానము ఎంతైనా అవసరము. మనము ప్రశాంతముగ నొక విషయము నాలోచింపవలసియున్నది. అది యేమనగా- ఈ శరీరములో అన్ని అవయవములకన్న సుఖమును కలిగించు ఇంద్రియములు శ్రేష్ఠమైనవి. ఇంద్రియములకన్న మనస్సు శ్రేష్ఠమైనది. మనస్సు కన్నను బుద్ధి శ్రేష్ఠముగానుండును. ఆ బుద్ధికన్నను పరమమైనది ఆత్మ. ఆ ఆత్మయే 'నేను-నేను' అని వ్యవహరించును. ఇంద్రియ మనోబుద్ధులు జీవాత్మకు సేవకులేగాని యజమానులు కావు. జీవాత్మ నిత్య

వ్యవహారములో నా ఇంద్రియములు, నా మనస్సు, నా బుద్ధి అని వ్యవహరించుచుండును. నావియైన వస్తువులు నా వశములో నుండును. అట్లే ఇంద్రియములు, మనస్సు, బుద్ధి జీవాత్మ వశములో నుండవలెను. దీనికి కఠోపనిషత్తులో నొక చక్కటి యుదాహరణ చెప్పబడినది. ఈ శరీరమును రథముగ భావించినట్లైన ఇంద్రియములు గుఱ్ఱములు, మనస్సు కళ్ళెము. బుద్ధి సారథి, జీవాత్మ రథికుడు అగును. రథికుని ఆజ్ఞలమేరకు సారథి రథమును నడిపించునట్లే మన యాజ్ఞమేరకు బుద్ధి మనస్సనే కళ్ళెముతో గుఱ్ఱములనే ఇంద్రియములను నిగ్రహించి ధర్మ మార్గమున నడుపవలెను.

ఇది కష్టసాధ్యమేగాని అసాధ్యము మాత్రము గాదు. ఈ ఇంద్రియనిగ్రహము లేనివాడు అధర్మాత్ముడగుటయేగాక యీ జన్మలోనే యెన్నో కష్టముల ననుభవించును. ఇంద్రియ నిగ్రహమునకు సత్సంగము, స్వాధ్యాయము, యోగాభ్యాసము అనగా యమ, నియమ, ఆసన, ప్రాణాయామాదుల అభ్యాసము చాలా తోడ్పడును.

## ఇంద్రియ నిగ్రహవాన్ భవ - షట్పదీ భవ

**భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యే మాక్షభి ర్యజత్రా ః।**
**స్థిరై రంగై స్తుష్టువాగ్ం సస్తనూభి**
**ర్వ్యశేమహి దేవహితం యదాయు ః॥ (యజు. 25-21)**

సృష్టియజ్ఞకర్తవైన ఓ దేవా ! పరమేశ్వర ! మేము నీ కృపచే మా చెవులతో మాకు ఉన్నతిని కలిగించు భద్రవచనములనే విందుము గాక. మా కన్నులతో భద్రమైన వానినే చూతము గాక. సుదృఢమైన మా వరీరాంగము లన్నిటితో నిన్నే స్తుతింతుము గాక. నిన్ను చేరుటకే శ్రమింతుము గాక. మా కర్మల ననుసరించి నీవు నియుక్తము చేసిన పూర్ణాయువును ఆనందముతో అనుభవింతుము గాక. అకాల మృత్యువాత బడకుందుము గాక.

# ధీ ః (బుద్ధి)

'ధీ'ః (ధై - చింతాయామ్) - దేనితో చక్కగా చింతన - ఆలోచన చేసి ఒక నిర్ణయము చేయుదుమో దానినే బుద్ధి అని యందురు. మానవునిలో బుద్ధి ఒక విశేష పదార్థము. దేనివలన సత్యాసత్యములు, ధర్మాధర్మములు, కర్తవ్యాకర్తవ్యములు తెలియబడునో అది బుద్ధి. ఇది మానవులలో మాత్రమే గలదు. మిగిలిన యే ప్రాణియందును లేదు. లోక వ్యవహారములో ఎన్నో విషయములను మనము విందుము. వాటిని గూర్చి కొంత ఆలోచింతుము. చివరకు మన బుద్ధి నిర్ణయించిన విషయమును గ్రహింతుము. ఈ బుద్ధి సరిగా పనిచేయకున్న సత్యమును, కర్తవ్యమును, ధర్మమును గ్రహించజాలము. తత్ఫలితముగా దానికి భిన్నముగా నాచరింతుము. లోకులు వెంటనే 'నీవు మనిషివా ? పశువువా ? నీకు బుద్ధిలేదా ?' అని నిందింతురు. అందుచే మిగిలిన జంతువులనుండి మానవుని వేరుచేయు సర్వోత్తమ గుణము బుద్ధి యని బోధపడుచున్నది.

ప్రతి మనిషిలోను కొద్దో గొప్పో బుద్ధి ఉండును. దానిని జ్ఞాన వృద్ధికరములగు వేద, వేదాంగ, షడ్ దర్శనముల పఠనముతో; సత్సంగముతో వృద్ధి పరచుకొనవచ్చును. ఎవరు దీనిని ప్రయత్నపూర్వకముగ ఎంత వృద్ధిజేసికొందురో వారంత ధర్మాత్ములగుదురు. ఎవరు తమ బుద్ధిని నశింపజేయు మార్గములో పయనింతురో వారంత అధర్మాత్ము లగుదురు. దానితో "బుద్ధినాశాత్ ప్రణశ్యతి" అని గీతలో కృష్ణుడు హెచ్చరించినట్లు వారు పూర్తిగా పతనమైపోవుదురు. కనుకనే ఈ బుద్ధికొఱకు చేయు ప్రార్థనయే శ్రేష్ఠతమమైన ప్రార్థనయని మన ప్రాచీన ఋషుల అభిమతము. బుద్ధివలననే లోకములో సర్వవిధములైన ప్రగతి, అభ్యుదయము సిద్ధించుచున్నవి. ఆ బుద్ధితో ప్రాపంచిక వస్తువులనన్నింటిని మనము పొందవచ్చును. అన్నిరకముల ఐశ్వర్యములను సిద్ధింపజేయు, మానవుని దివ్యమానవునిగా తీర్చిదిద్దగల, చివరకు భగవంతుని చేర్చగల శక్తి బుద్ధికి గలదు. అందుచేతనే బుద్ధికొఱకుచేయు ప్రార్థనయే సర్వోత్తమమని చెప్పబడినది. గాయత్రీ మంత్రములో అట్టి

ధారణశక్తిగల సద్బుద్ధి కొరకు ప్రార్థన గలదు. కాన, గాయత్రీ మంత్రమును పరమమంత్రమనియు, శ్రేష్ఠమంత్ర మనియు, గురుమంత్ర మనియు చెప్పియుండిరి.

నేడు లోకములో ప్రార్థనాపద్ధతులు అంతకంతకూ దిగజారిపోవుచున్నవి. "ఓదేవా! మాకు ఈనాటి ఆహారముకొరకు రొట్టెను ప్రసాదింపుము. త్రాగుటకు మంచి నీటిని ప్రసాదింపుము. లాటరీలో నాకు లక్షలు వచ్చునట్లు చేయుము. కోర్టులో నేనే గెల్చునట్లు వరమునిమ్ము. నా దొంగతనము పట్టుబడకుండునట్లు, నా నేరమునకు శిక్ష పడకుండునట్లు అనుగ్రహింపుము" అను ననేక విధములగు ప్రార్థనలను వినుచున్నాము. దేవుని గుణకర్మ స్వభావములు ఏమిటో తెలియనివారే ఈ విధమైన అల్ప ప్రార్థనలను చేయుదురు. ఇట్టి ప్రార్థనలు చేయువారికి, నిట్టి ప్రార్థనల నుపదేశించు మతములవారికి, సాంప్రదాయముల వారికి దేవుని గురించి ఒకింతయు తెలియదని చెప్పవచ్చును. ఇంతేగాక ప్రకృతి నియమములు కూడ వారికి తెలియవు. అట్టివారు ధర్మాత్ము లెట్లగుదురు? విరోధించు రెండు వర్గముల వారు తమకే మేలు కలుగవలెనని ఒకే దేవుని ప్రార్థించిన ఆ దేవుడు ఎవరి ప్రార్థనలను వినవలెను ? కేవలము పొగడ్తలతోనే వరముల నిచ్చువాడు దేవు డెట్లగును ? కనుక ఇట్టి ప్రార్థనలను ప్రార్థన లనతగదు. బుద్ధిని పెంపొందింపజేయు నుత్తమ గ్రంథముల నధ్యయనము జేయుచు, ఉత్తమ వ్యవహారముల నలవరచుకొనుచు ఇంకను బుద్ధి వికసింపవలెనని కోరు ప్రార్థనయే సర్వోత్తమ ప్రార్థన.

గీతలో శ్రీకృష్ణుడు బుద్ధి సాత్వికము, రాజసికము, తామసిక మని మూడు విధములుగా నుండునని తెలిపెను. అందు రాజస, తామస బుద్ధుల వలన దుఃఖములు కలుగుననియు, సాత్విక బుద్ధి మాత్రమే భగవంతుని చేర్చు ఉత్తమ సాధనమనియు వివరించెను. అది ఎట్టిదన -

శ్లో॥ **ప్రవృత్తిం చ నివృత్తిం చ కార్యాకార్యే భయాభయే ।**
**బంధం మోక్షం చ యా వేత్తి బుద్ధిః సా పార్థ ! సాత్వికీ ॥ (భ. గీ. 18-30)**

ఓ అర్జునా ! ఏది ప్రవృత్తి మార్గమో, ఏది నివృత్తి మార్గమో ; ఏ కార్యముల నాచరింపవలెనో, ఏ కార్యముల నాచరింపగూడదో ; ఆచరించిన

పిదప ఏది భయమునుకలిగించునో, ఏది నిర్భయతను ఉత్సాహమును కలిగించునో ; ఏది బంధన కారణమగునో, ఏది మోక్ష ప్రదాయినియో తెలిసికోగల బుద్ధిని సాత్త్విక మందురు.

కాన సాత్త్విక బుద్ధిని వృద్ధి పరుచుకొనుటకు గట్టి ప్రయత్నము చేయవలెను. ఏలయన -

**" దృశ్యతే త్వగ్ర్యా బుధ్యా సూక్ష్మయా సూక్ష్మ దర్శిభి : " (కఠ. 3-12)**

ఏకాగ్రమైన సాత్త్విక బుద్ధితోనే అత్యంత సూక్ష్మ తత్త్వములైన ఆత్మ పరమాత్మలను, కారణ రూప ప్రకృతిని సూక్ష్మదర్శు లైన యోగులు దర్శించ (తెలిసికొన) గలరు.

నేటి వైజ్ఞానిక ప్రగతి కంతకు బుద్ధియే కారణమని చెప్పవచ్చును. అందులో సందేహము లేదు. కాని, మనము భౌతిక విషయములలో నెంతగా బుద్ధిని వికసింపజేసికొనుచుంటిమో అభౌతికమైన ఆత్మ పరమాత్మల విషయములో, ధార్మిక విషయములలో, సామాజిక నియమముల విషయములలో నంతగా బుద్ధిని సంకుచిత పరచుకొనుచున్నాము. ఎవరేది జెప్పిన నది తేలికగ నమ్ముచున్నాము. విజ్ఞాన విరుద్ధ విషయములను కూడ ధర్మము పేరిట నమ్ముచున్నాము. ఖగోళ విజ్ఞాన మెంతయో వికసించినది. ఈ సూర్యకుటుంబములో గ్రహ ఉపగ్రహముల గురించి మనకెన్నో వాస్తవమైన విషయములు తెలియును. కాని, గుడిలోనికి బోయి నవగ్రహములను దేవతలని, అవి యీ లోకమున సామాన్యమానవుల గర్భమున పుట్టి, వరములవలన ఆకాశములో గ్రహములై ప్రజలను బాధించుచున్నవని నమ్ముచున్నాము. వాటి అనుగ్రహము కొఱకు పూజలు చేయుచున్నాము. వాటిచుట్టు ప్రదక్షిణలు చేయుచున్నాము. అవే మన అదృష్టమునకు కారణమని భ్రమపడుచున్నాము. ఈ భ్రమలు సామాన్యులనే గాక విజ్ఞాన వేత్తలనే భ్రమ పెట్టుచున్నవి. ఇంతకన్న విచిత్రము లోకములో నేమున్నది ? దీనికి కారణమేమన ఆ విజ్ఞానవేత్తలు తమ బుద్ధిని భౌతిక విషయములందు మాత్రమే ప్రయోగించుచున్నారు కాని, సూక్ష్మ విషయములందు ముఖ్యముగ ధార్మిక విషయములందు వినియోగించుట లేదు. దీనివలన మానవులుగా పుట్టి మనము తెలిసికోవలసిన అనేక విషయముల నుండి వంచితుల మగుచున్నాము.

ఇక సామాన్య ప్రజలు వివేకబుద్ధి లేకపోవుటచే అనేక విధముల మోసములలో పడి ఎన్నో కష్ట నష్టములకు గురియగుచున్నారు. మరికొందరు భోగలాలసులై మరింత బుద్ధిని నశింపజేయు అలవాట్లకు లోనగుచున్నారు. మాదక ద్రవ్యములన్నియు బుద్ధిని నశింపజేయునవే. **"బుద్ధిం లుంపతి యద్ద్రవ్యం మదకారీ తద్ ఉచ్యతే"** అని చెప్పబడినది. అందుచే మద్యమే కాక బుద్ధిని నశింపచేయు మిగిలిన గంజాయి, భంగు, అధునికమైన డ్రగ్స్ మొదలగు ద్రవ్యములన్నియు మాదక ద్రవ్యములే యగును. మాదక ద్రవ్యమును సేవించిన వ్యక్తి తాను ఏమిచేయుచున్నాడోతనకే తెలియదు. తాను ఏమి మాట్లాడుచున్నాడో కూడ తెలియదు. అతని ప్రేలాపనలను విని చిన్నపిల్లలు కూడ నవ్వుదురు. ఎగతాళి చేయుదురు. తాత్కాలికముగ కొద్దికాలము లభించు మానసిక మత్తుకొఱకు బుద్ధిని నశింపజేయు, ఆరోగ్యమును నశింపజేయు మాదక ద్రవ్యములను సేవించువారు ధర్మమునకు ఎంత దూరమగుచున్నారో, మానవత్వమునుండి యెంత దిగజారిపోవుచున్నారో మీరే ఆలోచించుడు.

కాలక్రమములో మన శరీరము మలినమగునట్లే మన బుద్ధికూడా కొంతమలిన మగుచుండును. శరీర మాలిన్యములను దూర మొనర్చుకొనుటకు స్నానము చేయునట్లే బుద్ధిని శుద్ధ మొనర్చుకొనుటకు కూడ ప్రయత్నించవలెను. మనువు బుద్ధిని శుద్ధమొనర్చుకొనుటకు జ్ఞాన మవసరమని చెప్పియుండెను. "బుద్ధిః జ్ఞానేన శుద్ధ్యతి" జ్ఞాన మను నీటివలన బుద్ధి శుద్ధమగును. అట్టి జ్ఞానము సద్గ్రంథ పఠనమువలన ముఖ్యముగ వేదాధ్యయనమువలన, దర్శనముల అధ్యయనమువలన శుద్ధమగును. శుద్ధమైన బుద్ధిగలవాడే భౌతికముగా ధర్మాత్ముడగుటతోబాటు తనను తాను తెలిసికొనగలుగును. పరమాత్మను తెలిసికొనగలుగును. కష్టములకు దూరమై నిఃశ్రేయసమును అనగా ఉత్తమ శ్రేయస్సును - ముక్తిని పొందును. కనుక మనమందరము నిత్యము సంధ్యావందనము ద్వారా గాయత్రీ మంత్ర జపము వేద స్వాధ్యాయము చేసి మన బుద్ధిని వికసింపజేసికొందము గాక.

## ధీమాన్ భవ - సప్తపదీ భవ

# విద్య

'విద్ - జ్ఞానే' అను మూల సంస్కృత ధాతువుతో 'విద్య' యను పద మేర్పడును. కాన, విద్యయనగా జ్ఞానమని సామాన్యార్థము. **'వేత్తి యథావత్ తత్త్వపదార్థ స్వరూపం యయా సా విద్యా'** - అని నిర్వచనము. అనగా 'దేనివలన ఈ సృష్టిలోని పదార్థముల యథార్థ స్వరూపము తెలియనగునో అది విద్య' యని తెలిసికొనవలెను.

అయితే, జ్ఞానముయొక్క క్షేత్రము అనంతము, అపారము, ఏలయన - ఏలాంటి మేధావికైనను - విజ్ఞానవేత్తకైనను సృష్టిలోని ఏ చిన్న పదార్థమును గూర్చియు సంపూర్ణముగా తెలిసికొను సామర్థ్యమున్నట్లు కానరాదు. శోధించి శోధించి ఒక పదార్థమును గురించి కొంత తెలిసికొన్నను కాలాంతరమున ఆ పదార్థములో మరికొన్ని గుణములు మరియొక విజ్ఞానవేత్తచే కనుగొనబడు చున్నవి. అప్పుడప్పుడు మొదటి సిద్ధాంతములో దోషములున్నట్లు తెలిసికొనబడు చున్నవి. అట్లుండ, ఈ సృష్టిలోని అసంఖ్యాక పదార్థముల యథార్థ జ్ఞాన మెట్లు లభించును ? అను ప్రశ్న ఉదయించును. అందుచే మన ఋషులు బాగుగా నాలోచించి ఒక సరళమైన మార్గమును కనిపెట్టిరి. బుద్ధియను ప్రయోగశాలలో పరిశోధించి ఈ సృష్టిలోని పదార్థములన్నియు పంచభూతములచే ఏర్పడినట్లు కనుగొనిరి. అవి ఏవియనగా పృథివి (భూమి), జలము, అగ్ని, వాయువు, ఆకాశము (అను పంచభూతములు) ; కాలము, దిక్కు, (Time & Spce) అను రెండు సాధారణ కారణములు ; ఆత్మ, మనస్సు అను సూక్ష్మపదార్థములునని వివరించిరి. వీటితోనే ఈ నామ రూపాత్మకమైన ప్రపంచ పదార్థములన్నియు ఏర్పడినవి. అయితే ఏ పదార్థమేర్పడుటకైనను కాలము, దిక్కు అనురెండు సాధారణ కారణములు అనివార్యములు. ఏలయన ఏ పదార్థమైనను తయారగుటకు కొంత సమయము పట్టును. అది కొంతకాలముండును. తదుపరి నశించును. నశించుటకుకూడ కొంత కాలము పట్టును. ఇంతేగాక, ఆపదార్థమేదేని ఒక ప్రదేశములో ఉత్పన్నమై ఏదేని కొంత ప్రదేశము (Space) ను ఆక్రమించియుండును. అందుచే కాలము, దిక్కు ప్రతి పదార్థమునకు

అనివార్యముగా ఉండును. ప్రపంచమున కేవలము జడ పదార్థములేగాక చేతన పదార్థములు అనగా జ్ఞానము గల పదార్థములుకూడ బుద్ధి గోచర మగుచున్నవి. అందు మొదటిది శరీరాదులలో వ్యవహరించబడు 'నేను' 'నేను' అను జీవాత్మ. ఇది ఒకటి కాక అనేకము. దీని పరిమాణము పరమాణు సదృశమని చెప్పవచ్చును. ఏలయన సూక్ష్మదర్శిని యంత్రముతో మాత్రమే దృష్టి గోచరమగు ప్రాణులున్నవి గదా ! అందుచే అవి అణు స్వరూపములు. రెండవది-ఈ సృష్టిని సృష్టిలోని పదార్థములను, జీవులు ధరించిన 84 లక్షల జీవ జాతుల శరీరములను యోజనాబద్ధముగా, విజ్ఞానయుక్తముగా, ఒక విశిష్ట ప్రయోజనము కొరకు రచించిన అనంత జ్ఞానసామర్థ్యములుగల విశ్వవ్యాపకమైన మహత్తర శక్తి. ఈ మహత్తర శక్తినే విశ్వాత్మ - పరమాత్మ అని వేదశాస్త్రములు పేర్కొనును. ఇది ఒక్కటిగానే యున్నది. సర్వత్ర వ్యాపించియున్నది. పరమాణువులలోను, జీవాత్మలలోనుకూడ వ్యాపించి యున్నది. లేకున్న ఈ సృష్టి యింత సమతుల్యముగా నుండదు. అందుచే పరమాత్మను మహత్ పరిమాణముగా దర్శన శాస్త్రములు వర్ణించును. సూక్ష్మముగా నాలోచించినచో జీవాత్మ పరమాత్మలేకాక మనస్సు అను ద్రవ్యము కూడ బుద్ధిగోచరమగును. ఇదియును బాహ్యేంద్రియములకు కానరాదు. అణు పరిమాణముగలిగి జీవాత్మలను అంటిపెట్టుకొని యున్నది. జీవాత్మకు ఇంద్రియములతో సంబంధ మేర్పరచుచున్నది. అందుచే దీనిని అంతరింద్రియమని ఋషులు పేర్కొనిరి. దీనితో సృష్టిలోని పదార్థములు 9 అగుచున్నవి. అవి, పంచభూతములు, కాలము, దిక్కు, జీవాత్మ-పరమాత్మ, మనస్సు. వాటినే **"పృథివ్యాపస్తేజోవాయు రాకాశం కాలోదిగాత్మా మన ఇతి ద్రవ్యాణి"** అని కణాద మహర్షి సూత్రీకరించెను. వైశేషిక దర్శనకారుడైన కణాదమహర్షి తెలిపిన పై తొమ్మిది ద్రవ్యములలో వేనిలో ఏయే గుణాలున్నవో పొరబడకుండ తెలిసికొనుటనే విద్య యందురు. అట్టి విద్య మనలో నెంతగా వృద్ధి చెందునో యంతగా మనలో మానవత్వం వృద్ధి చెందును. పై ద్రవ్యములలో గల ఆయా గుణములను ఎంతో హేతుబద్ధముగా విజ్ఞానయుక్తముగా కణాదమహర్షి తన వైశేషిక దర్శనమునందు

వివేచించి వివరించి తెలిపెను. వాటిని యిక్కడ వివరించుట అసాధ్యము. తెలిసికొనగోరువారు ఆ దర్శనమును చదువగోరెదను.

అయితే, లోకములో (పై ద్రవ్యములతో తయారైన) అనేకానేక పదార్థములు కనబడుచున్నవి. వాటిని గూర్చి అనేకానేక విజ్ఞాన శాస్త్రములు వికసించుచున్నవి. పరిశోధనలు జరుగుచున్నవి. ఎన్నెన్నో నూతనావిష్కారములు జరుగుచున్నవి. మరి యివి అన్నియు విద్యలుకావా? అని సందేహము కలుగుట సహజము. దానికి వేదము చక్కగా సమాధానము చెప్పెను. ఈ భౌతిక విజ్ఞానమునకంతకు వేదము 'అవిద్య' యని పేరిడును. ఇచట అవిద్య యనగా అజ్ఞాన మని పొరబడరాదు. మానవ జీవన లక్ష్యమైన మోక్ష ప్రాప్తి కలిగించలేనిది యనియు, ఈ లోకమున సుఖముగా జీవించుట కవసరమైన భౌతిక విద్య మాత్రమే ననియు అర్థము చేసికొనవలెను. అందుచేతనే - పొరబడుదురేమో యనియే వేదము విద్య, అవిద్యలు రెండును అవసరమని ఎంత చక్కగా వివరించునో చూడుడు

**"అంధంతమః ప్రవిశన్తి యే అవిద్యా ముపాసతే ।**
**తతో భూయ ఇవ తే తమో య ఉ విద్యాయాగ్ం రతా : ॥**

**(యజుర్వేదము. 40-12)**

కేవలము అవిద్యనే అనగా ఇంద్రియ గోచరమగు భౌతిక పదార్థ విద్యను మాత్రమే ఉపాసించువారు అంధకారమున - అజ్ఞానమున బడుదురు. అటులనే కేవలము విద్యనే అనగా బ్రహ్మవిద్యను మాత్రమే ఉపాసించుచు గర్వించువారు ఇంతకన్నను గాఢమైన అంధకారమున బడియుందురు.

**"అన్యదేవాహుర్ విద్యాయా అన్యదాహు రవిద్యాయాః ।**
**ఇతి శుశ్రుమ ధీరాణాం యేనస్తద్ విచచక్షిరే ॥ (యజు. 40-13)**

భౌతిక విద్యవలన కలుగు లాభము ఒక విధమైనదియనియు, ఆధ్యాత్మిక విద్యవలన కలుగు లాభము వేరే విధమనియు వేదవేత్తలు చెప్పుదురు. అట్టి ఉపదేశములు వినుచున్నాము.

**"విద్యాంచాంవిద్యాంచ యస్తద్వేదోభయగ్ం సహ ।**
**అవిద్యయా మృత్యుం తీర్త్వా విద్యయాఽమృత మశ్నుతే ॥ (యజు. 40-14)**

ఎవరు ఆధ్యాత్మిక విద్యను, భౌతిక విద్యను రెంటిని ఒక సారిగానే తెలిసికొనుచు నిజ జీవితమున అందుకు అనుగుణముగా సాధన చేయుదురో వారు ఆ రెంటి లక్ష్యములను చేరుకోగలరు. భౌతిక విద్యవలన మృత్యువును - అనగా ఇహలోకమున కలుగు దుఃఖముల నన్నిటిని తరింతురు. నివారణ చేసికొందురు. ఆధ్యాత్మిక విద్యవలన అమృతత్త్వమును - జన్మరాహిత్యమును- ముక్తిని బొందుదురు.

పై వేదోపదేశమును బట్టి ఈ లోకమున సుఖముగా జీవించుటకు భౌతిక విద్య అవసరమని తెలియుచున్నది. కాని, అదే పరమార్థముగా భావించి ఎన్ని సుఖముల ననుభవించినను అంధకారములో నున్నవారమే యగుదుము. ఒక గొప్ప నష్టమును బొందిన వారమే యగుదుము. ఋషులు ఏమి చెప్పుచున్నారో వినుడు -

**'ఇహ చేదవేదీ దథ సత్యమస్తి - న చే దవేదీ న్మహతీ వినష్టిః ।**

**(కేనోపనిషత్ - 13 - 5)**

ఈ జన్మలోనే ఆత్మ పరమాత్మలను తెలిసికొన గలిగినచో అతని జన్మ సఫలమైనట్లు తలంచవలెను. లేకున్నచో 'మహతీ వినష్టిః, గొప్ప నష్టమే జరిగినట్లు ఎఱుంగవలెను. ఏలయన పరమేశ్వరుడు ఈ ఉత్తమ మానవ జన్మమును అందుకొఱకే - ఆత్మను తెలిసికొనుటకే యిచ్చినాడు. ఎంత భౌతిక ఉన్నతిని బొందినను దానిని పొందలేకున్నచో గొప్ప నష్టముగాక మరేమగును?

కాన భౌతిక ఆధ్యాత్మిక విద్యలు రెండును అవసరమే. ఆ రెంటిని జోడించియే అభ్యసింపవలెను. ఎప్పుడో ఉద్యోగవిరమణ చేసిన తదుపరి ఆధ్యాత్మిక విద్యను చదువవచ్చునులే అని అశ్రద్ధ చేయరాదు. ఏ క్షణమున మరణము వచ్చునో ఎవని కెరుక ! కనుక ఏ యిబ్బందులు లేకుండ సుఖముగా జీవన నిర్వహణ జరుపుకొనగలుగునంత భౌతిక విద్య నభ్యసించిన చాలును. మిగిలిన సమయమంతా అమూల్యమైన ఆధ్యాత్మికవిద్య నభ్యసించుటకే వెచ్చింపవలెను. అదే మనను జన్మ మరణ దుఃఖరూప సంసార సాగరమునుండి తరింప జేయును.

ఆధ్యాత్మిక విద్య అందని పండని నిరాశ చెంద నవసరములేదు. దాని నభ్యసించుటకు వ్యాకరణము చదివిన సంస్కృత పండితులే కానక్కరలేదు. మాతృభాషలోనే దానిని అర్థముచేసికొని ఆచరించి పరమాత్మలోని ఆనందమును బొందవచ్చును. అందుకు సర్వోత్తమ సరళ గ్రంథము మహర్షి దయానంద విరచిత 'సత్యార్థ ప్రకాశము'. పేరుకు తగినట్లు వేద శాస్త్రములన్నిటిని మథించి తీసిన తైలముతో వెలిగే సత్యార్థమును ప్రకాశపరచు ప్రదీపము" అది ఎంతగా చదివిన అంతగా మన బుద్ధి వికసించును. అందు ముఖ్యముగా షష్ఠమ, సప్తమ, అష్టమ సముల్లాసములు చదివి మననము చేసికొని సాధన చేసినను మన జన్మ ధన్యమగును.

ఎంతగా ఆధ్యాత్మిక విద్యలో పండితులైనను అతని లోని సూక్ష్మమైన అజ్ఞానము తొలగనిది ముక్తి లభించదు. ఆ సూక్ష్మ అజ్ఞానమునకే పతంజలి మహర్షి అవిద్య యని పేరిడి దాని నిట్లు వివరించెను.

**'అనిత్యాశుచి దుఃఖానాత్మసు నిత్య శుచి సుఖాత్మ ఖ్యాతి రవిద్యా'**

**(యోగదర్శనం 2-5)**

నిరంతరము పరిణామము చెందుచు అనిత్యమైన ఈ సృష్టిలోని పదార్థములను, మన శరీరములను నిత్యమని - ఎప్పుడును ఇట్లే ఉండునని వ్యవహరించుట, మల మూత్రాదులతో నిండిన మన శరీరములను, ఇతరుల శరీరాలను శుచిగా నుండునవని పొరబడుట, దుఃఖమిశ్రితమై క్షణికమైన సుఖముల నిచ్చు ఈ ప్రాపంచిక సుఖములనే నిత్య సుఖము లనుకొనుట తనకు రథమువలె నున్న ఈ శరీరమునే తాను అనుకొనుచు అట్లు వ్యవహరించుట - అను ఈ నాల్గింటిని అవిద్య యందురు.

దీనికి భిన్నమైనదే విద్య. అనగా ఈ ప్రపంచ పదార్థములను, తన శరీరమును అనిత్యమనుకొనుట; శరీరములు మల మూత్రాదులతో కూడి అశుచిగా నున్నవనుకొనుట; ప్రాపంచిక సుఖములన్నియు దుఃఖమిశ్రితము లనుకొనుట ; శరీరము తాను కాదనియు, తాను జీవాత్మ ననియు నిర్ణయించుకొని అట్లు వ్యవహరించుట విద్య యనబడును.

ఏ విద్య లభించుటకైనను అక్షర జ్ఞానము అనివార్యము. చదువుట, వ్రాయుట నేర్వకున్న ఏమి సాధించగలము ? అందుచేతనే భాషా జ్ఞానమునే నేడు లోకమున విద్య యనుచున్నాము. అది లేకున్న మనకు పశువులకు భేద మేమున్నది ? విద్య లేనివాడు వింత పశువను సామెత ఎవ్వరెరుగనిది.

## విద్యావాన్ భవ - అష్టపదీ భవ

**యాం మేధాం దేవగణాః పితరశ్చోపాసతే ।**
**తయా మామద్య మేధయాగ్నే మేధావినం కురు స్వాహా ॥**

**(యజు. 32-14)**

ఓ జ్ఞానస్వరూప పరమేశ్వర ! ఏ మేధాబుద్ధిని విద్వాంసులు, పితరులు (జ్ఞానముతో రక్షించువారు) కోరుచున్నారో అట్టి మేధాబుద్ధిని నాకు ప్రసాదింపుము. అందుకు నా ప్రయత్నమనే ఆహుతి నర్పించుచున్నాను.

## గాయత్రీ మహామంత్రము

**విశ్వామిత్రుడు ఋషి - సవిత దేవత - గాయత్రీ ఛందస్సు**

**ఓం భూర్భువః స్వః తత్సవితుర్వరేణ్యమ్**
**భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్ ॥**

భావార్థము : ఓ సచ్చిదానందానంతస్వరూప! ఓ నిత్య శుద్ధబుద్ధముక్తస్వభావ! ఓ నిరాకార! సర్వశక్తి మంతుడవగు నో న్యాయకారీ! ఓ కరుణామృతవారిధీ! నీ దివ్యము, వరేణ్యము నగు విజ్ఞానరూపమును మేము నిత్య ముపాసింతుము. మాకు ధారణశక్తిగల బుద్ధి నిత్తువుగాక! మేమా బుద్ధి సహాయమున బ్రహ్మచర్యాది సద్వ్రతముల నాచరింతుముగాక! విద్యాజ్ఞానాదులను పొంది పరమసుఖముల నొందుదుము గాక!

# సత్యము

'సత్య' మనగా ఎల్లప్పుడూ ఉండునదని అర్థము. సత్యమైన మాటయే ఎంతకాలమైనను మార్పు జెందక ఎన్ని పరీక్షలకైనను నిలబడి యుండగలదు. అసత్యమైన మాట మొదట భ్రమ కలిగించినను తదుపరి అది నిలకడగా నుండక మారిపోవును. సామాన్య దృష్టితో జూచిన మిగిలిన జీవరాసుల నుండి మానవుని వేరు చేయునది వాణి - వాక్కు. అనగా తన భావమును వ్యక్తీకరించగల భాష. దీనినే నోరని కూడ లోకములో వాడుదురు. ఎవరైన నొక పశువును బాధించిన "అయ్యో! నోరులేని పశువును బాధించుట నాయమా!" అని యందురు. దీనిని బట్టి పశువుల నుండి మానవులను వేరు చేయునది భావము కలిగిన భాష - మాటలు అని తెలియుచున్నది. అట్టి భాషను చక్కగా ప్రయోగించుటయే సత్యమని చెప్పవచ్చును. లోకములో మానవుడు తన యింద్రియములతో, మనస్సుతో కొన్ని విషయములను గ్రహించును. దానిని ఆత్మ బుద్ధితో మరియొకసారి పరీక్షించి ఒక నిర్ణయము జేయును. ఆత్మ తన భావమును వ్యక్తము జేయవలెనను ఇచ్ఛ గలిగినపుడు మరల లోపల కొంత ప్రయత్నము జరుగును. దానిని మహర్షి పాణిని యిట్లు వర్ణించెను.

**"ఆత్మా బుద్ధ్యా సమేత్యార్థాన్ మనో యుఙ్క్తే వివక్షయా ।**
**మనః కాయాగ్ని మాహంతి స ప్రేరయతి మారుతమ్ ।**
**మారుత స్తూరసి చరన్మన్దం జనయతి స్వరమ్ ॥ (వర్ణోచ్చారణ శిక్ష)**

అనగా ఆత్మ తన బుద్ధితో అర్థముగల మాటలను ప్రోగుచేసి మనస్సును ప్రేరేపించును. మనస్సు జఠరాగ్నిని ప్రేరేపించును. అప్పుడు లోపల మందస్వరముతో ఆ భావము వ్యక్తమగును. అది నోటి ద్వారా శబ్దములుగా వెలువడును. మానవుడు మాత్రమే ఇట్లు చేయగలడు. అట్టి శక్తిని సద్వినియోగ పరచుకొనుటయే సత్యము. మనము కంటితో దేనిని చూచితిమో, చెవులతో దేనిని వింటిమో, మనస్సుతో దేనిని ఆలోచించితిమో దానినే మాటలతో బ్రకటించవలెను. దీనినే వ్యాసుడు యోగదర్శనములోని **"సత్య ప్రతిష్ఠాయాం క్రియాఫలాశ్రయత్వమ్"** (యోగ. 2-36) అను సూత్రమునకు భాష్యము వ్రాయుచు -

"సత్యం యథార్థే వాఙ్మనసే యథాదృష్టం, యథానుమితం, యథా శృతం తథా వాఙ్మనశ్చేతి, పరత్ర స్వబోధ సంక్రాన్తయే వాగుక్తా సా యది న వఞ్చి తా వా ప్రతి పత్తి వన్ధ్యావా భవే దితి ।"

మనోవాక్కులతో యథార్థమును పలుకుటయే సత్యము. అనగా దేనిని చూచితిమో, తెలిసికొంటిమో, వింటిమో దానిని ఇతరులకు చెప్పునప్పుడు మనోవాక్కులను అటులే ప్రయోగించవలెను. చూచి, విని తెలిసికొని ఏ విషయమును తాము ఎట్లు తెలిసికొంటిరో వానిని అట్లే ఇతరులు తెలిసికొనునట్లు చెప్పుటయే సత్యము పలుకుటయగును. కాని నీవు విన్నట్లుగనే సరిగా అదే పదజాలమును ప్రయోగించినను నీ వాక్చాతుర్యమును గాని, అజాగ్రత్తవలన గాని వినువాడు భ్రమ జాలములో పడినచో లేక అర్థము చేసికోలేక పోయినచో ఆ పలుకులు సత్యములు గావు. అట్లే భాష సత్యమైనను భావమును మార్చి చెప్పుటవలన వినువాడు ఆ మాటలను సరిగా అర్థముచేసికోలేకున్న అదియును సత్యము కాదు.

నిత్య వ్యవహారములో దీనిని అందరు పాటించ లేక పోవుచున్నారు. చాలమంది తమ మనస్సులో నొకటియుండ మాటలలో మఱియొకటి చెప్పుదురు. చెప్పిన దానికి భిన్నముగ పనులు చేయుదురు. అట్టి ఆచరణ కపటమైన ఆచరణ. ఇది మానవుని మానవత్వమునుండి దూరముచేసి దానవత్వమువైపు గొనిపోవును. దీనినిబట్టి పశుత్వమునుండి, దానవత్వమునుండి మానవత్వమును వేరుచేయునది సత్యభాషణ యని తెలియుచున్నది. సత్యమువలననే ధర్మము వృద్ధి జెందునని ఋషులు చెప్పియుండిరి. "ధర్మం సత్యేన వర్ధతే" ఎంతగా తను సత్యమును పలుకునో తా నంత ధర్మాత్ముడగును. పరమేశ్వరుని చేర్చగల అత్యంత వేగవంతమైన నౌక సత్యము. సత్య వ్రతమును స్వీకరించిన వెంటనే క్రమముగా అన్ని దుర్గుణములు దూరమై పోవును. అందుచే సత్యవ్రతమే అన్ని వ్రతములకన్న గొప్పదని చెప్పబడినది.

పరమేశ్వరునకు 'సత్య' మని పేరుగలదు. ఇచట సత్యమనగా ఎల్లప్పుడు (త్రికాలములయందు) మూలపదార్థములైన ప్రకృతి, జీవాత్మ పరమాత్మలలో గొప్పదైన పరమాత్మ యని అర్థము. సత్ పదార్థములలో

సాధువైనది (సత్సు పదార్థేషు సాధు తత్ సత్యం). వేదము **సత్యేనోత్తభితా భూమిః** " అని చెప్పుచున్నది. అనగా ఈ భూమి సత్యస్వరూపుడగు పరమాత్మచే ఆకాశమున పడిపోకుండా ధరింపబడియున్నదని అర్థము.

**సత్యేన ధార్యతే పృథివీ సత్యేన తపతే రవి :।**
**సత్యేన వాతి వాయుశ్చ సర్వం సత్యే ప్రతిష్ఠితమ్ ॥**

"సత్యమువలన పృథివి నిలిచియున్నది. సత్యముచేతనే సూర్యుడు తపించి ప్రకాశము నిచ్చుచున్నాడు. సత్యముచేతనే వాయువు వీచుచున్నది. సర్వమును సత్యముపైననే ఆధారపడియున్నది" యని ఋషులు చెప్పియున్నారు. ఇచట సత్య మనగా పరమేశ్వరుడు లేదా పరమేశ్వరుని సత్య నియమములని యర్థము. అంతేకాని, మనము మాట్లాడే సత్యమైన మాటలే వాటిని ధరించి శాసించుచున్నవని భావించరాదు. మన సత్యభాషణము ఆ 'సత్య' నామముగల పరమేశ్వరుని చేర్చగల దివ్యమైన నౌక యని తలంచవలెను.

లోక వ్యవహారములో సత్యము పలికిన చాల కష్టనష్టములకు గురియగుదుమని; ఎన్నో కష్టములను, ఇబ్బందులను, నష్టములను చిన్న అస్యతము పలికి తప్పించుకొనవచ్చునని చాలమంది వాదింతురు. అది నిజమేమో యనికూడ ననిపించును. మన దగ్గర డబ్బుఉన్నప్పుడు ఒక వ్యక్తి అప్పుకొఱకు మన దగ్గరకు వచ్చిన 'నా దగ్గర ఉన్నది కాని నీకు ఇవ్వ'నని చెప్పిన, అతనికెంతో కష్టము కలుగుటయేకాక మనను అనేక రకములుగ దూషించి వెళ్ళును. ఒకవేళ అప్పుఇచ్చిన అతను మంచివ్యక్తి కానియెడల దానిని మనము పోగొట్టుకున్న వారమే యగుదుము. అప్పును గురించి అడుగుటవలన ఇద్దరి మనస్సులు వికలమగును. ఇంత కలుగకుండ 'నాదగ్గర లేదు'అను చిన్న అబద్ధముతో వీటన్నిటిని తప్పించుకొనవచ్చునని చాలమంది ఆలోచన. కాని, ఋషుల యభిప్రాయము వేరు. నిత్య జీవితములో కూడ సత్యమును పలుకగల స్థితికి మనము ఎదుగ గలిగినపుడే సత్య స్వరూపుడైన పరమాత్మ సాక్షాత్కారము కాగలదనియు, ఇంతేగాక భౌతికమైన ఉన్నతిని కూడ సత్యసంధులే పొందుదురనియు వారి యభిమతము.

అయితే, ఆ సత్యమును ప్రియముగా చెప్పుటెంతైనా అవసరము.

సత్యమైనను అ ప్రియముగా నుడివి ఒకరికి బాధను కలిగించిన అధర్మాత్ముల మగుదుము. అందుచేతనే మనువు -

"సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాత్, న బ్రూయాత్ సత్యమప్రియమ్ ।
ప్రియంచ నానృతం బ్రూయా దేష ధర్మ స్సనాతన ః ॥ (" మనుస్మృతి 4-138)

'ఎప్పుడు సత్యమునే పలుకవలెను. దానిని ప్రియముగా పలుకవలెను. సత్యమును అప్రియముగా పలుకరాదు. అట్లని ప్రియముగ అసత్యమును బలుకరాదు. ఇదియే సనాతనమైన ఆర్యధర్మము' అని చెప్పియుండెను. అప్రియ సత్యమనగా గ్రుడ్డివానిని ఓ గ్రుడ్డివాడా ! యనియు. కుంటి వానిని ఓ కుంటివాడా ! యనియు పిలుచుట. ఇవి సత్యమైనను ఆ వ్యక్తికి బాధను గలిగించును. ఇక ఇతరుల మెప్పుకొఱకు చాలమంది అసత్యమును పలుకుదురు. అదికూడ మంచిదికాదు. ఈ విషయమును విదురుడు చక్కగా చెప్పియున్నాడు.

**"పురుషా బహవో రాజన్, సతతం ప్రియవాదిన ః ।**
**అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః ॥ "**

"లోకములో ఎల్లప్పుడును ప్రియము పలుకువారు అనేకులు గలరు. కాని కల్యాణకరమగు సత్యవచనమును అప్రియమని తెలిసినను చెప్పియే తీరువారు కాని, వినువారు కాని దుర్లభము" సారాంశమేమన పరుల దోషములను వారియెదుటనే వారి మంచిగోరి ప్రేమభావముతో వివరించి చెప్పుటయు, తమ దోషములను ఇతరులనుండి బాధపడక వినుటయు ఎంతైనా అవసరము. అట్టి సత్యవాదు లన్నిరంగములలోను పురోగమింతురు. సత్యవంతులకు ఐశ్వర్యముకూడ సిద్ధించునని ఋగ్వేదము చెప్పను.

**సక్తుమివ తితఉనా పునన్తో యత్ర ధీరా మనసా వాచ మక్రత ।**
**అత్రా సఖాయ ః సఖ్యాని జానతే, భద్రైషాం లక్ష్మీ ర్నిహితాధి వాచి॥"**
**(ఋగ్వేదము. 10-71-2)**

'జల్లెడతో సత్తుపిండిని జల్లించి బరకపదార్థమును, పొల్లువంటి ఇతర పదార్థములను వేరుచేసి మెత్తటిపిండిని మన ముపయోగించుకొనుచున్నట్లు ధీరులైన విద్వాంసులు మనస్సుతో వాక్కును జల్లించి సత్యమైన, మృదువైన

మాటలనే ప్రయోగింతురు. అట్టివారికే ఆత్మీయులైన మిత్రులెందరో లభింతురు. అట్టివారితో తాను సఖ్యము చేయగలుగును. ఇంతేగాక, క్షేమకరమైన లక్ష్మి (ఐశ్వర్యము) ఇట్టి మధురమైన సత్యవాణియందే ఉండును'

నిజముగ సత్యవాది మొదట కొన్ని కష్టములు పడినను కాలక్రమమున కీర్తిని, ఐశ్వర్యమును తప్పక పొందును. అబద్ధము చెప్పువాడు మొదట కొంత ప్రయోజనము పొందినను కాలక్రమమున అన్ని విధముల పతనమైపోవును. ఈ సత్యవ్రతము నాచరించగల సామర్థ్యము మనయందు పెంపొందింపజేసి కొనుటకు ప్రార్థన కూడ అవసరము. గాన కర్మఫల ప్రదాతయైన పరమేశ్వరుని ప్రార్థన చేయుదము రండు.

ఓం **వ్రతానాం వ్రతపతే । వ్రతం చరిష్యామి ।**
**తత్తే ప్రబ్రవీమి, తచ్ఛకేయం, తేన బుధ్యాసం,**
**ఇద మహమనృతాత్ సత్యముపైమి. . . . . .**

'ఓ పరమేశ్వరా ! నీవు సర్వవ్రతములకు వ్రతఫలము నిచ్చు వ్రతపతివి. నేను సత్యవ్రత మాచరించ సంకల్పించితిని. అది నీకు చెప్పి చేయుదును. దాని నాచరించు శక్తిని నాకు ప్రసాదింపుము. దానివలన నేను శక్తివంతుడనగుదును గాక. నేను అసత్యమును వదలి సత్యమును గ్రహించ గలుగుదును గాక'

## సత్యవ్రతో భవ - నవపదీ భవ

**దృష్ట్వా రూపే వ్యాకరోత్ సత్యానృతే ప్రజాపతి : ।**
**అశ్రద్ధా మనృతేఽదధాత్ శ్రద్ధాం సత్యే ప్రజాపతి : ॥** (యజు. 19-17)

ప్రజలను పాలించు పరమేశ్వరుడు అన్నివిషయములందును సత్య, అసత్యములను వేరుచేసి ఉంచెను. మానవులకు వాటిని వేరువేరుగా వివేచించగల బుద్ధి నిచ్చెను. అసత్యమున అశ్రద్ధను , సత్యమున శ్రద్ధను కలిగియుండు డని ఉపదేశించెను.

# అక్రోధము

'క్రోధ' మనగా కోపమని, పగ అని సామాన్య అర్థము. కాని ఈ పదము 'కృష్ - హింసాయాం' అను ధాతువునుండి సిద్ధమగును, కాన ఇతర ప్రాణులను హింసించుటయే క్రోధము. దీనినే వైరభావమనికూడ ఋషులు చెప్పియుండిరి. వైరభావమువలననే ఒక ప్రాణి మరియొక ప్రాణిని హింసించుట జరుగును. అక్రోధమనగా ఏప్రాణిని హింసించకుండుట. పశువులలో కొన్ని జాతులందు జన్మతో వచ్చిన సహజ వైరముండును. ఎలుక జాతిపైన పిల్లిజాతికి సహజవైర ముండును. కొన్ని జంతువులలో (కుక్క మొదలగు జాతులలో)స్వజాతివైరము కూడ నుండును. అవి పరస్పరము కొట్లాడుకొనుచుండును. ఇట్టి వైరభావము మనుష్యులలో నున్నచో వారు పశుతుల్యులే యగుదురు. క్రోధితుడై వివేక రహితముగా ప్రవర్తించిన వ్యక్తిని చూచి లోకులు 'నీవు మనిషివా ? పశువువా? అని నిందింతురు గదా !

మనిషి వైరభావమును విడిచి సర్వ భూతములయందు మైత్రి, కరుణ భావములను పెంచుకొనిన విశాల హృదయము కలవాడు కాగలడు. అట్టి ఆలోచనాశక్తి, ఆత్మ విచారణాశక్తి ఒక్క మానవునికే ఉన్నది. జన్మ జన్మాంతరముల సంస్కారముల వలన కొందరిలో ఈ క్రోధము ఎక్కువగా నుండును. ఆ క్రోధము మిగిలిన ప్రాణులపైననే గాక స్వజాతీయులైన తోటి మానవులపైన తనవారిపైనకూడ నుండుట విచారకరము.

ఆలోచించినచో క్రోధమే సర్వ పాపములకు మూలము. క్రోధము వలన ఇతరులకు అపకారము జరుగుటయేగాక తనకును నష్టము జరుగును. క్రోధము రాగానే కండ్లు ఎఱ్ఱబడును, నరములు ఉద్రేకము చెందును, శరీరము వణకును, గుండె దడదడ లాడును, శరీరము రోమాంచితమగును, నాలుక అదుపు తప్పును. సభ్యమానవుని నోటివెంట కూడా అనరాని మాటలు, అపశబ్దములు వచ్చును. శరీరములో అనేక విషము లుత్పన్న మగు ననియు విజ్ఞాన శాస్త్రము చెప్పును. తద్వారా కొన్ని రోగములు కూడా కలుగవచ్చును. ఇది శారీరక పరిస్థితి. ఇక మానసిక స్థితి ఇంతకన్నను దిగజారును. గీతలో శ్రీకృష్ణుడు ఈ విషయమును చక్కగా వర్ణించెను.

**శ్లో॥ క్రోధాత్ భవతి సమ్మోహః సమ్మోహాత్ స్మృతి విభ్రమః ।**
**స్మృతి భ్రంశాత్ బుద్ధినాశో బుద్ధినాశాత్ ప్రణశ్యతి ॥**

**(భ.గీ. 2-63)**

క్రోధము వలన తాను జేయు కార్యముల పరిణామ మెట్లుండునో తెలిసికొను వివేకము కోల్పోవును. అవివేకమువలన తన స్థితిని, ధర్మమును మరచిపోవును. తద్వారా ధర్మాధర్మములను కర్తవ్యాకర్తవ్యములను నిర్ణయించు బుద్ధి నశించును. బుద్ధి నశించిన సారథిలేని రథము (డ్రైవరు లేని వాహనము వలె) అదుపు తప్పి నశించునట్లు మానవుడు ఎంతగానో నష్టపడును.

క్రోధితుడు ప్రత్యర్థి నిర్బలుడైన అతనిని చంపుటకు లేదా వికలాంగుని చేయుటకు పరుగెత్తును. శిక్షకు పాత్రుడగును. ప్రత్యర్థి బలవంతుడైన కోపము నణచుకొని మానసికముగా కృంగిపోవును. ఆత్మహత్యకు పాల్పడును. సర్వ విధముల నష్టపోవును.

ఈ క్రోధము పోగొట్టుకొనుటకు మనుష్యులు చాల ప్రయత్నించవలసి యున్నది. ముందుగా ఇది యెందువలన కలుగుచున్నదో విచారించుట యెంతైనా అవసరము. దీసికి భగవద్గీత చాల చక్కటి వివరణ ఇచ్చుచున్నది. మనుష్యుడు సాధారణముగ పాపపు పనులన్నియు కామక్రోధములవలననే చేయుచుండును.

**"కామ ఏష క్రోధ ఏష రజోగుణ సముద్భవః**
**మహాశనో మహాపాప్మా విద్ధ్యేన మిహ వైరిణమ్ " (భగవద్గీత 3-37)**

ఈ కామ క్రోధములు రజోగుణమునుండి ఉత్పన్నమగును. ఇవి రెండును నిండింపరాని చిల్లిగంపలవలె నుండును, ఇవి మిక్కిలి ఉగ్రమైనవని వీటిని గొప్ప శత్రువులుగా భావింపుము అని శ్రీకృష్ణుని ఉపదేశము.

కామక్రోధములు రెండును మానవులకు శత్రువులు. పరిశుద్ధమైన జీవాత్మను నిప్పుకణమును బూడిద ఆవరించియున్నట్లు, స్వచ్ఛమైన అద్దమును దుమ్ము ఆవరించియున్నట్లు, గర్భస్థ శిశువును మావి కప్పియున్నట్లు కామ క్రోధము లను మలినములు కప్పివేయుచున్నవి. మానవుని బుద్ధి కూడ వీటిచే కప్పివేయబడును. ఇవి నిత్య శత్రువులు. అగ్నివలె నిండింపరానివి (భగవద్గీత 3-38, 39) అని కూడ శ్రీకృష్ణుడు చెప్పి యున్నాడు.

అయితే యిట్టి బలీయమైన కామక్రోధములను వివేకముతో మనము జయింపవచ్చును. దానికి కృష్ణుడు చెప్పిన మార్గము చాల ఉత్తమమైనది.

**ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః**
**మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధే పరత స్తు స ః ॥**
**ఏవం బుద్ధేః పరం బుద్ధ్వా సంస్త భ్యాత్మాన మాత్మనా**
**జహి శత్రుం మహాబాహో కామరూపం దురాసదమ్ ॥**

**(భగవద్గీత 3-42, 43)**

క్రోధమునకు కారణము కామము. తన కోరిక నెరవేరనప్పుడు మనిషికి ఈ కోపము వచ్చుట జరుగును. కనుక మనము కామములేకుండ జేసికొనుట మొదట చేయవలసిన పని. అందుకు ఆత్మ విచారణ అవసరము. ఒంటరిగా ప్రశాంతముగా కూర్చొని తానెవరు ? మనస్సు ఏమిటి ? బుద్ధి ఏమిటి ? వాటికి నాకుగల సంబంధమేమి ? అని విచారింపవలెను. " ఈ స్థూల శరీరములో నింద్రియములు జ్ఞాన సాధనము లగుటవలన శ్రేష్ఠములు. ఇంద్రియములకంటె వానిని ప్రవర్తింపచేయు మనస్సు శ్రేష్ఠము. ఈ మనస్సుకంటె నిశ్చయాత్మకమైన బుద్ధి శ్రేష్ఠము. బుద్ధి కంటె వేరుగా ఒక ద్రష్టగా రథమును ఆరోహించిన రథికునిగా, శ్రేష్ఠముగా జీవాత్మయుండును. ఓ అర్జునా ! ఇట్టి ఆత్మ విచారణతో ; రథమువంటి ఈ శరీరము, సారధివంటి బుద్ధి, కళ్ళెమువంటి మనస్సు, గుఱ్ఱమువంటి ఇంద్రియములు నా ఆజ్ఞమేర నడువవలెనుకాని వాటికి నేను లోబడకూడ దను దృఢ సంకల్పముతో దుర్జయమగు ఈ కామ మను శత్రువును జయింపు' మని కృష్ణుని ప్రబోధము.

ఒక చిన్న కారణమువలన కూడ కొందరిలో తీవ్రమైన కోపము వచ్చుచుండును. కొందరు అకారణముగానే లేక ఒక చిన్న యపరాధమునకే కోపము వచ్చి రాక్షసులై పోవుదురు. అప్పుడు యుక్తాయుక్త వివేకము కోల్పోయి ఇతరులకు అపకారముగావింతురు. ఇది సామాన్య మానవులయందే గాక సాధు సంన్యాసులయందుకూడ కనబడుచుండును. చరిత్రను పరిశోధించిన నెంతో మంది ఋషులు క్రోధమువలన పతనమైపోయినట్లు మనకు కనబడును.

అయితే క్రోధములేకున్న లోకములో కొన్ని వ్యవహారములు జరుగుట

కష్టము. పిల్లవాడు తప్పుచేసిన వానిని సంస్కరించుటకు కోప మవసరము. సేవకుడు తప్పుచేసిన అతనిని దారిలో పెట్టుటకు కోప మవసరము. ఇట్టి కోపమును క్రోధ మనరాదు. దీనికి వేదము మరియొక చక్కటి పేరు పెట్టెను. దానిని "మన్యు" వనును. 'మన్యు' వనగా తల్లి తన బిడ్డ తప్పుచేసిన మంచి మార్గములో పెట్టుటకు ప్రయోగించు దండము. ఇది మనకు చాల అవసరము. ఇది లేకున్న లోకవ్యవహారము జరుగదు. పరమేశ్వరునిలో ఈ మన్యువు పూర్ణముగా నుండును. అందుచేతనే మనము **'మన్యురసి మన్యుం మయి ధేహి'** - అని ప్రార్థింతుము. 'హే భగవాన్! నీవు మన్యువుచే పూర్ణుడవు. మాకు కూడ ఆ మన్యువును ప్రసాదింపుము.' మన్యువుతో బాటు మరియొకటి మనము కోరుట అవసరము, అదేమనగా సహనము.

మహర్షి దయానందుడు అద్భుత సహన మూర్తి. ఒక సారి ఒక దుష్ట బ్రాహ్మణుడు కపట భక్తిని ప్రదర్శించుచు విషమిశ్రిత పదార్థ మొక దానిని మహర్షిచే తినిపించెను. స్వామి దానిని రుచిచూచి అది విషయుక్తమని గ్రహించి నౌలి, వస్తిక్రియల ద్వారా దానిని తొలగించుకొనెను. స్వామి భక్తుడైన తహశీల్దారు సయ్యద్ మహమ్మద్ కు ఈ విషయము తెలిసి ఆ బ్రాహ్మణుని పట్టి బంధించి స్వామి చెంతకు తీసికొనిరాగా "నేను జనులను బంధింపజేయుటకు రాలేదు. బందీలను ముక్తులుగ జేయవచ్చితిని. అతనిని విడిచిపెట్టుడు" అని కోరెనట.

ఒకసారి కర్ణవాసమున వైష్ణవమతమున గల రాసలీలలోని దోషములను ఎత్తి చూపుచుండుగా రావు కర్ణసింహుడు స్వామిపైకి ఖడ్గ ప్రహారము చేయ లంఘించగా అతని చేయిపట్టి ఖడ్గమును విరచి, యిపుడు నిన్ను ఏమైనను చేయగలను. కాని నేను సంన్యాసిని, నీ దౌష్ట్యమునకు కోపించి, నీ కనిష్ట చింతన చేయువాడను గాను, వెళ్ళు. నీకు ఈశ్వరుడు మంచిబుద్ధి నిచ్చుగాక, అని వదిలి పెట్టెను. ఇట్టివే అనేక సంఘటనలు స్వామి జీవిత కాలమున జరిగెను. చివరిగా జోధపూర్ సంస్థానములోవంటబ్రాహ్మణుడైన జగన్నాథుడు రాజవేశ్య ప్రలోభముతో భయంకరమైన పాషాణ విషమును పాలయందు గలిపి దయానందులవారికిచ్చుట జరిగెను. ఆ తీవ్ర విష ప్రభావము, వైద్యుల

కుట్ర అతని మరణమునకు కారణమయ్యెను. అట్టి తీవ్ర విషము నిచ్చిన జగన్నాథుని స్వామిజీ పిలిచి, ఓ జగన్నాథా ! నీ విచ్చిన విషమువలన నే తలపెట్టిన లోకహిత కార్యములన్నియు అసంపూర్ణముగానే నిలిచిపోయినవి. నీవు నాకన్న లోకమునకే యెక్కువ కీడు చేసితివి. నేను సంన్యాసిని గాన నిన్ను క్షమించుచున్నాను. ఇవిగో ఐదువందల రూప్యములు, వీటిని తీసికొని యీ దేశమును విడిచి నేపాలుకు పారిపొమ్ము. లేకున్న ఈ రాజు, ప్రజలు నిన్నిచట బ్రతుకనివ్వరు" అని హెచ్చరించి పంపివేసెను. అందుచే మనము -

'సహోఽసి సహో మయిధేహి - 'హే పరమేశ్వరా ! నీవు సహనగుణ పూర్ణుడవు. నాయందును ఆ సహన సామర్థ్యమును నింపుము' అని ప్రార్థించ వలెను. పరమేశ్వరుడు జీవులు చేసిన కర్మలకు న్యాయముగా ఫలముల నిచ్చునపుడు న్యాయాధీశుని (జడ్జి) వలె వారిని సంస్కరించుట కొరకై శిక్ష వేయునే గాని క్రోధభావనతో - వైరభావనతో కాదు. అటులనే మానవులు క్రోధమును విడిచి, మన్యువును ధరించి లోకములో ప్రకాశించవలెను. మనము ఎంతగా క్రోధమునకు దూరమగుదుమో అంతగా ధర్మాత్ముల మగుదుము.

# జిత క్రోధో భవ - దశపదీ భవ

**సహృదయం సాంమనస్య మవిద్వేషం కృణోమివ ః।**
**అన్యో అన్య మభి హర్యత వత్సం జాతమివాఘ్న్యా ॥**

**(అథర్వ 3-30-1)**

ఓ మానవులారా! మీరు విశాల హృదయులు, ఆలోచనాపరులు, ద్వేషరహితులు కాగోరుచున్నాను. ఒకరినొకరు నవజాతవత్సమును గోమాతవలె ప్రేమించుకొనుచు ఒకరి ఉన్నతికి మరొకరు తోడ్పడుచు ఉన్నతిని చెందగోరెదను.

# ఉపసంహారము

ఈ పది గుణములు మానవుని మిగిలిన ప్రాణిజాతుల నుండి వేరు చేయుచున్నవి. వీటిని మానవ ధర్మములందురు. మానవులు ఈ ధర్మములనేకాక మరికొన్ని ధర్మములను కూడ పాటించవలసియున్నది. మానవుడు జంతువులవలె ఒంటరిగా జీవించలేడు. అత నొక సంఘజీవి. సంఘములో జీవించుటకు అతను కొన్ని సాంఘిక ధర్మములను పాటించవలసియుండును. ఋషులు, మునులు మానవుని దివ్య మానవునిగా చేయుటకు చక్కటి ప్రణాళికలను రూపొందించిరి. అవి వర్ణాశ్రమధర్మములు. వాటిని కూడ పాటించవలసి యుండును. వీటన్నిటిని తెలిసికొనుటకు మనుస్మృతి మనకెంతయో తోడ్పడును. ఇంతేకాక విదురనీతి, చాణక్యనీతి, వివిధ స్మృతులు మనకు ఎంతో తోడ్పడును. అన్నిటిని మించి వేదములలో ఈ విషయములు స్పష్టముగా, హేతుబద్ధముగ, విజ్ఞానయుక్తముగ చెప్పబడినవి. వేదములలో మానవ కల్పితములైన ప్రక్షిప్తములు ఏమీ లేవు. కాని, మిగిలిన ఋషికృత గ్రంథములలో కాలాంతరమున స్వార్థపరులు తమ సంకుచిత భావములను జొప్పించిరి. కాన వేదాల వెలుగులో నా చొప్పింపులను ఏరివేయవలసి యుండును. ఆర్య పండితులట్టి కృషిచేసిరి. మనుస్మృత్యాది గ్రంథముల నధ్యయనము చేయునపుడు ఆర్య విద్వాంసుల వ్యాఖ్యాన గ్రంథములనే అధ్యయనము చేయుట యెంతైనా అవసరము. వేదములు సార్వజనికములు, సార్వకాలికములు. మానవుడు ఏ దేశవాసి యైనా, ఏ కాలానికి చెందినవాడైనా వాటిని అనుసరించగలడు. వేదములలో చెప్పిన ధర్మములను, ఋషిమునులు చెప్పిన ధర్మములను పై పదిగుణములు కలవాడే చక్కగా నాచరించగలడు. లేకున్న తానెంత విద్వాంసుడైనను, తానెంత స్వాధ్యాయపరుడైనను అధర్మాత్ముడై పశుతుల్యుడగును. కనుక పైన చెప్పిన ధృతి క్షమాది పదిగుణములు ముందుగా మనలో తెచ్చుకొనుటకు గట్టి ప్రయత్నము చేయవలెను.

ఈ పది గుణములను నిత్య జీవితములో నాచరించువారే మానవు లన తగుదురు. అప్పుడే సంఘములోనున్న కురీతులు, కుసంస్కృతులు తొలగిపోయి సర్వమానవ సౌభ్రాతృత్వం వెల్లివిరియును. ఒకే దేవుడు, ఒకే జాతి, ఒకే ధర్మము అను భావన కలుగును. సంఘములో నైతిక విలువలకు ప్రాధాన్యత హెచ్చును. ప్రతి ఒక్కరు తనను తాను సంస్కరించుకొని సంఘానికి దేశానికి ప్రయోజనకారు లగుదురు.

## సదా 'మానవ ధర్మ' పథే పురోగమీ భవ

మతములు మానవులను విభజించును.

ధర్మము మాత్రమే సంఘటిత పరచును.

అట్టి ధర్మము వేదములందు హేతుబద్ధముగా కలదు.

వేదమే ఈశ్వరీయము. మిగిలినవి కావు.

అది సృష్టికర్తయైన పరమేశ్వరుని ఉపదేశం అందు మానవులకు వలయు సమస్త సత్యవిద్యలు ఉన్నాయి. సమస్త విద్యా విజ్ఞానాలకు అదే మూలం. శారీరక, బౌద్ధిక, ఆత్మికోన్నతులు పొందాలంటే వేదమార్గమే సర్వోత్తమ మార్గం.

అట్టివేదం 'మానవ ధర్మం' గురించి ఏమి చెప్పుచున్నదో తెలిసికొందము రండు.

# వేదాలలో 'మానవ ధర్మం'

## మానవ ధర్మమే వైదిక ధర్మం - వైదిక ధర్మమే మానవ ధర్మం

1) 'మనుర్భవ జనయా దైవ్యం జనమ్' - ఋగ్ 10-53-6
ఆలోచనాపరుడవైన మానవుడవై ఆదర్శ మానవ సమాజమును నిర్మింపుము.

2) 'అజ్యేష్ఠాసో అకనిష్ఠాస ఏతే సంభ్రాతరో వావృధుః సౌభగాయ'
(ఋగ్. 5-60-5)
ఓ మానవులారా ! మీలో ఒకరు ఎక్కువ కాని ఒకరు తక్కువకాని కారు. (మీరంతా ఒకే పరమాత్ముని బిడ్డలు కాన) మీరంతా సోదరులు. మీరంతా కలసిమెలసి ఉన్నతిని సాధించుడు.

3) 'సంగచ్ఛధ్వం సంవదధ్వం సంవో మనాంసి జానతామ్' (ఋగ్. 10-191-2)
మీరంతా కలిసి నడువుడు. కలిసి ఆలోచించుడు. మీ చిత్తములు ఏక సమానములై జ్ఞానవికాసము నొందుడు.

4) 'సమానీ ప్రపా సహ వో z న్న భాగః' (అథర్వ 3-30-6)
నూతులు,చెరువులు మొదలుగ మీ జలస్థానములు ఒకటిగానే ఉండవలెను. మీ అన్న భాగములు సమానముగా ఒకే చోట ఉండవలెను.

5) 'అన్యో అన్యస్మై వల్గు వదన్త' (అథర్వ - 3-30-5)
ఒకరితో నొకరు ప్రసన్నతతో మధురముగా మాట్లాడుకొనుడు.

6) 'అనువ్రతః పితుః పుత్రో మాత్రా భవతు సంమనాః' (అథర్వ 3-30-2)
పుత్రులు తండ్రికి అనుకూలురై మెలగవలెను.తల్లితో ఏకమనస్కులై వర్తించవలెను.

7) ' మోఘమన్నం విన్దతే అప్రచేతాః సత్యం బ్రవీమి వధ ఇత్స తస్య '
(ఋగ్. 10-117-6)
సోమరి కష్టపడకుండా అన్నమును, భోగములను కోరును. అట్టివాడు అన్ని విధముల పతన మగును. ఇది సత్యము.

8) **'అక్షైర్మా దీవ్య ః కృషిమిత్ కృషస్వ' (ఋగ్. 10-34-13)**
జూదములు (లాటరీలు, పందెములు) ఆడవద్దు. వ్యవసాయదారుని వలె కష్టించి ధనము నార్జించుము.

9) **'మా గృధః కస్య స్విద్ధనమ్' - (యజు. 40-1)**
ఎవరి ధనమును అన్యాయముగా ఆశించవద్దు.

10) **'శతహస్త సమాహర సహస్రహస్తసంకిర' (అథర్వ 3-24-5)**
ధర్మమార్గమున నూరు చేతుల (విధముల) సంపాదించుము. దానిని వేయి చేతుల ధర్మకార్యముల వినియోగించుము.

11) **'ఉతో రయిః పృణతో నోపదస్యతి ఉతాపృణన్ మర్డితారం న విన్దతే' (ఋగ్. 10-114-1)**
దానమిచ్చువారి ధనసంపత్తి క్షీణింపదు. దానమివ్వని వాడు ఎన్నడును సుఖముల నిచ్చు (పుణ్యము, కీర్తి, తరుగని ఐశ్వర్యము) మొదలగు?

12) **'అసద్ భూమ్యా ః సమభవత్ తద్యామేతి మహద్ వ్యచ ః ।'**

**(అథర్వ. 4-19-6)**
పాపము భూమిపైనున్న మానవునియందు పుట్టును. పెరిగిపెరిగి అంతరిక్షమున వ్యాపించి, ద్యులోకమువరకు పెరుగును. అది అంతదూరము వెళ్ళినను నిశ్చయముగా తిరిగివచ్చి కర్తకే చేరును. అతనిని దుఃఖములపాలు గావించి సంతాపమును కలిగించును.

13) **'ఉత దేవా అవహితం దేవా ఉన్నయథా పునః' (ఋగ్. 10-137-1)**
ఓ విద్వాంసులారా ! మీరు దేవతలు-దివ్యగుణములు కలవారు. కాన అథోగతిలోనున్న పతితులను, పాపులను మరల ఉన్నతులను జేయుడు.

14) **'స నో యమఃప్రతరం జీవసే ధాత్' (అథర్వ. 18-3-63)**
పరమేశ్వరుడు మనలను గౌరవముగా జీవించుటకై సృజించెను.

15) **'సా నో భూమి ర్వర్ధయద్ వర్ధమానా' (అథర్వ. 12-1-13)**
మా మాతృదేశము ప్రపంచమున ఉన్నత శిఖరమున ఆసీనయై మాకు కూడా ఉన్నతిని కలిగించును గాక.

16) **'మా గతానామాదీధీథా' (అథర్వ. 8-1-8)**
గతించిన దానిని గురించి విచారించవద్దు (చేయబోయేది సరిగా చెయ్యి).

17) **'ఇన్ద్రం ఆశాభ్యస్పరి సర్వాభ్యో అభయం కరత్' (అ. 20-20-7)**
ఓ పరమేశ్వర మమ్ము అన్ని వైపుల నుండి నిర్భయుల జేయుము.

18) **'ఆప్నుహి శ్రేయాంసమితి సమం క్రామ' (అ. 2-11-5)**
నీకన్న శ్రేష్టులను చేరుకో, నీ సమానులకంటె ముందుకు నడు.

19) **'అశ్మానం తన్వం కృధి' (అ. 1-2-2)**
రాయివంటి సుదృఢమైన శరీరమును నిర్మించుకో

20) **'మా పురా జరసో మృథాః' (అ. 5-30-17)**
పుర్ణాయువు ననుభవించనిదే మరణించవద్దు.

21) **'అస్మాకం వీరా ఉత్తరే భవన్తు' - (సామ. 1849)**
మా వీరులు ప్రపంచ యోధులలో సర్వశ్రేష్ఠ లగుదురుగాక.

22) **'అర్చన్నను స్వరాజ్యమ్' - (సామ. 410)**
నీవు స్వరాజ్యమును అర్చించు. గౌరవించు.

23) **'వృషా మతీనాం పవతే విచక్షణః' - (సామ. 821)**
విద్వాంసులు తమ జ్ఞానవర్షంతో లోకమును పవిత్ర పరతురు గాక.

24) **'స్వయం యజస్వ తన్వం స్వాహితే' - (సామ. 1589)**
నీవు నీ శరీరమును స్వయముగా పోషించుకో, బలపరచుకో, రక్షించుకో, అది నీది.

25) 'త్వేషం వాచో z అపావధీత్ ' (యజు. 5-8)
క్రోధముతో కూడిన మాట (మనలనే) నాశనము చేయును.

26) 'వాచస్పతిర్వాచం నః స్వదతు' - (యజు. 11-7)
వాక్పతియైన పరమేశ్వరుడు మా వాణిని మధురము చేయును గాక.

27) 'ఇద మహ మనృతాత్ సత్యముపైమి' - (యజు. 1-5)
నేను అసత్య ఛల కపటములను విడచి సత్యమును గ్రహింతును గాక.

28) 'మా హిర్భూర్మా పృదాకుః' - (యజు. 8-23)
నేను సర్పములవలె, కొండచిలువలవలె కుటిలుడను కాకుందును గాక.

29) 'మిత్రో విశ్వాభిరూతిభిః' - (యజు. 33-46)
సన్మిత్రులు సమస్త సాధనములతో మమ్ము రక్షింతురు గాక.

30) 'సఖా సుశేవో అద్వయుః' - (సామ. 649)
సన్మిత్రుడు సరళతతో కపటరహితుడై సహకరించును

31) 'దేవానాం సఖ్యముపసేది మా వయమ్' - (యజు. 25-15)
మేము విద్వాంసుల, జ్ఞానుల మిత్రతను బొందుదుము గాక

32) 'తపసో జాత తపసో విభూతమ్' - (ఋగ్ - 10-183-1)
విద్యా జ్ఞానములు తపస్సుతో(పరిశ్రమతో) ఉత్పన్నమగును. అవి తపస్సుతోనే ప్రకాశించును - తనకు, ఇతరులకు మేలు చేయును.

33) 'తృతీయేన జ్యోతిషాం సం విశాస్వ' - (ఋగ్. 10-56-1)
ఓ పరమేశ్వర ! నాకు జ్ఞానరూప-తృతీయ నేత్రము నిమ్ము.

34) 'చోదయిత్రీ సూనృతానాం చేతన్తీ సుమతీనామ్ । యజ్ఞం దధే సరస్వతీ ॥' (ఋగ్. 1-3-11)
మధుర వాక్కులతో సత్యధర్మమును బోధించుచు, బుద్ధిమంతులను ప్రేరేపించుచు సరస్వతి (విదుషీ స్త్రీ) యజ్ఞము నిర్వహించుచున్నది. (అనగా స్త్రీలు వేదశాస్త్రాలు చదివి యజ్ఞాదులు చేయించుచు ధర్మప్రబోధం చెయ్యాలని దీని భావం.)

35) **'స్త్రీ హి బ్రహ్మా బభూవిథ' - (ఋగ్. 8-33-19)**
స్త్రీలు నిశ్చయముగా యజ్ఞబ్రహ్మలుగా ఉండిరి. అనగా యజ్ఞము చేయించువారిలో స్త్రీలు బ్రహ్మగా (ముఖ్యులుగా) ఉండిరి - ఉండవలెను. అట్లు కాగలరు.

36) **'తన్త్రమేకే యువతీ నిరూపే అభ్యాక్రామం వయతః షణ్మయూఖమ్।' (అథర్వ. 10-7-42)**
యువతీ స్త్రీ రాజ్య తంత్రమును, యుద్ధ తంత్రమునుకూడ నడుపగలదు.

37) **'అహం కేతురహం మూర్ధాహముగ్రా వివాచనీ' - (అథర్వ. 10-159-2)**
గృహసామ్రాజ్యమున నేనే రాణిని. అందరికి మకుటమువంటి దానిని. నా మాటనే అందరు విందురు.

38) **'మమ పుత్రాః శత్రుహణో ऽథోమే దుహిత విరాట్' (ఋగ్. 10-159-3)**
నా పుత్రులు శత్రుంజయులు. నా పుత్రి విశ్వవందిత - సద్గుణ రాశి.

39) **'భీమా జాయా బ్రాహ్మణస్యోపనీతా' - (ఋగ్. 10-109-4)**
స్త్రీ యజ్ఞోపవీతినియై వేదశాస్త్రముల నధ్యయనము చేసి శాస్త్రార్థములతో ఎదుటి వారికి భయమును కలిగించును.

40) **బ్రహ్మచర్యేణ కన్యాయువానం విందతే పతిమ్' (అథర్వ. 11-5-18)**
స్త్రీ బ్రహ్మచర్యదీక్షతో విద్యా బల యౌవనములను పొంది తనకు తగిన పతిని పొందును - ఎంచుకొనును.

41) **యథా సింధుర్నదీనాం సామ్రాజ్యం సుషువే వృషా।'**
**ఏవాత్వం సమ్రాజ్ఞ్యేధి పత్యురస్తం పరేత్య ॥ (అథర్వ. 14-1-43)**
ఓ స్త్రీ! నదులనెడి సామ్రాజ్యమునకు సముద్రము రాజయినట్లు నీవు పతి కుల సామ్రాజ్యమునకు సామ్రాజ్ఞివి కమ్ము.

42) 'ఇయమగ్నే నారీ పతిం విదేష్ట సోమో హి రాజా సుభగాం కృణోతి ।'
సువానా పుత్రాన్ మహిషీ భవాతి గత్వా పతిం సుభగా విరాజతు ॥'
(అథర్వ. 2-36-3)

ఓ పరమేశ్వర ! నీ కృపవలన ఈ యువతి తన ప్రియమైన పతిని పొందును గాక. చంద్రునివలె ప్రజలను ఆనందపరచు రాజు ఈమెను ధన కనక వస్తు వాహనాదులతో ఐశ్వర్యవతిని చేయును గాక. ఈమె తన పతితో వీరపుత్రులను కని, సౌభాగ్యవతియై పూజింపబడుచు విరాజిల్లును గాక.

43) **'ఏషా తే రాజన్ కన్యా వధూర్ని ధూయతాం యమా ।'**
ఓ నరుడా ! ఈ కన్య తన ఉత్తమ వ్యవహారముతో నీకు కీర్తిని తెచ్చును.

44) **'అవీరామివ మామయం శరారురభి మన్యతే ।'**
**ఉతాహమస్మి వీరిణీన్ద్రపత్నీ మరుత్సఖా విశ్వస్మాదిన్ద్ర ఉత్తర ః ॥'**
**(ఋగ్. 10-86-9)**

ఓ పురుషులారా ! నేను అబలను కాను. సబలను. వీరపత్నిని. మీరు ఏ పరమేశ్వరుని ధరించుచున్నారో నేనును ఆ పరమేశ్వరుని ధరించు చున్నాను. నేను వాయువువంటి బలమైన దానను.

45) **'శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే' - (యజు. 36-8)**
ఓ ఈశ్వర ! రెండు, నాలుగు లేదా అనేక పాదములతో నడుచు (సర్పము మున్నగు) ప్రాణులకు సుఖ శాంతుల నొసగుము.

46) **'పుమాన్ పుమాంసం పరిపాతు విశ్వత ః' (ఋగ్. 6-75-14)**
ప్రతి మనిషి తోటి మానవునికి సర్వవిధముల సహాయపడుచు రక్షించు చుండవలెను.

47) **'భూరీణి భద్రా నర్యేషు బాహుషు' - (ఋగ్. 1-166-10)**
వీరుల బాహువులలో మానవ హితము చేయగల బల సామర్థ్యములు పుష్కలముగ నున్నవి.

48) **సఖేవ సఖ్యే నర్యో రుచే భవ' - (ఋగ్. 9-105-5)**
సన్మిత్రుడు తన మిత్రునికి సహాయపడునట్లు ప్రతివ్యక్తి మానవమాత్రు లందరికి మేలు చేయవలెను.

49) **'ఋషిః స యో మనుర్హిత ః ' - (ఋగ్. 10-26-5)**
మానవహితము కొఱకు అంకిత మగు వారే ఋషులు.

50) **ఆ నో భద్రాః క్రతవో యన్తు విశ్వతః' (ఋగ్. 1-89-1)**
మాకు అన్ని వైపుల నుండి మేలుచేయు మంచి ఆలోచనలే వచ్చును గాక.

51) **'విశ్వా ద్వేషాంసి ప్రముముగ్ధ్యస్మత్' (ఋగ్. 4-1-4)**
హే ఈశ్వర ! మాలోని సమస్త ద్వేషభావములను తొలగించి రక్షించుము.

52) **'ఊర్ధ్వం నో అధ్వరం కృతమ్' - (ఋగ్. 7-2-7)**
హే ప్రభూ! మా జీవనరూప యజ్ఞమును సదా ఉన్నతివైపు నడిపింపుము.

53) **'ఇయం తే యజ్ఞియా తనూః ' - (యజు. 4-13)**
ఓ మానవా ! నీ శరీరము పరోపకారాది యజ్ఞకర్మలుచేసి భగవంతుని చేరుటకై యివ్వబడినది.

54) **'ఈజానాః స్వర్గంయన్తి లోకమ్' - (అథర్వ 18-4-2)**
యజ్ఞాది సత్కర్మలు చేయువారు ఉత్తమ లోకములను - శరీరములను బొందుదురు.

55) 'అరిష్టాః స్యామ తన్వా సువీరాః " - (ఋగ్. 10-128-3)
మేము రోగరహితమైన శరీరమును పొంది వీర సంతతిని, ఉత్తమ సుఖములను పొందుదుము గాక.

56) 'తపోభిరదహో జరూథమ్' - (ఋగ్. 7-1-7)
తాపసిక జీవితమును గడపుచు దీర్ఘాయువును పొందుడు. ముసలితనమును దూరము చేయుడు.

57) **'తమేవ విద్వాన్ న బిభాయ మృత్యోః' - (యజు. 31-18)**
ఆత్మ తత్త్వము నెఱిగినవాడు మృత్యువుకు భయపడడు.

58) **'తమేవ విదిత్వాzతి మృత్యుమేతి ' (యజు. 31-18)**
మన ఆత్మలో పరమేశ్వర సాక్షాత్కారము పొందినపుడే సమస్త దుఃఖముల నుండి విముక్తిని పొందుదుము.

59) **'ఆరోహణ మాక్రమణం జీవతో జీవతో z యనమ్' - (అథర్వ. 5-30-7)**
ఉన్నతిని పొంది ముందుకు పయనించుటయే ప్రతి వ్యక్తి యొక్క ధర్మము. కర్తవ్యము.

60) **'ఆ రోహ వయ ఉన్నృజానః' - (అథర్వ. 18-3-73)**
జీవితమును పవిత్ర పఱచు కొనుచు ఉన్నతిని పొందుము

61) **"యజధ్వం హవిషా తనా గిరా " (ఋగ్. 2-2-1)**
తను మనో ధనములతో యజ్ఞాది సత్కర్మలు చేయుము.

62) **"కరో యత్ర వరివో బాధితాయ" - (ఋగ్. 6-18-14)**
బాధితులకు సహాయపడు చేతులే ఉత్తమమైన చేతులు

63) **"ఘృతం మే చక్షు రమృతం మ ఆసన్" (ఋగ్. 3-26-7)**
నా చూపులలో (ఘృతం) ప్రేమ ప్రకాశించును గాక !
నా మాటలలో (అమృతం) మాధుర్యము వర్షించును గాక !

64) "నిందితారో నింద్యాసో భవంతు" - (ఋగ్. 5-2-6)
పరులను నిందించువారు అందఱితో నిందింపబడుదురు

65) "దూర ఊనేన హీయతే" - (అథర్వ. 10-8-15)
చెడు సహవాసము వల్ల మనుష్యుడు చెడిపోవును

66) "జుషస్వేంద్ర పురుతమస్య కారోః" - (ఋగ్. 3-39-7)
ఓ మానవా ! ఉత్తముల, పురుషార్థపరుల సాంగత్యము చేయుము.

67) "న దుష్టుతీ మర్త్యో విందతే వసు" - (ఋగ్. 7-32-21)
దుష్టునకు ఎచ్చటను ధనముగాని, నివాసము గాని లభించదు.
(తాత్కాలికముగా లభించినను అది నిలువదు)

68) "ఋతస్య పంథా మన్వేతి సాధు" - (ఋగ్. 1-124-3)
సజ్జనులు సదా సత్యమార్గమునే అనుసరింతురు. ఉపదేశింతురు.

69) "అపాం నపాతం సఖాయం కృధ్వమ్" (ఋగ్. 7-34-15)
కర్తవ్యమును నెరవేర్చువానినే స్నేహితునిగా చేసికొమ్ము

70) "ఉపసర్ప మాతరం భూమిమ్" - (ఋగ్. 10-18-10)
నీ మాతృభూమిని సేవింపుము. రక్షింపుము.

71) "మాతా భూమి ః పుత్రోహం పృథివ్యాః - (అథర్వ. 12-1-12)
భూమి నాతల్లి. నేను ఆ మాతృభూమికి పుత్రుడను.

72) "ఊర్ధ్వం కృణ్వంత్వధ్వరస్య కేతుమ్" - (ఋగ్. 3-8-8)
దేశ పతాకమును ఉన్నతముగా నుంచుము. గౌరవించుము.

73) "ఉత్తిష్ఠత సంనహ్యధ్వముదారాః కేతుభిః సహ" (అథర్వ. 11-10-1)
ఓ శూర వీరులారా ! లెండు. జాతీయ పతాకము చేబూని దేశరక్షణకై సన్నద్ధులు కండు.

74) "వయం తుభ్యం బలిహృతః స్యామ" - ( అథర్వ. 12-1-62)
ఓ మాతృభూమి ! నీ రక్షణకై మా తను మనో ధనములను బలిగా నర్పింతుము గాక !

75) "కృతం మే దక్షిణే హస్తే జయో మే సవ్య ఆహితః ." (అథర్వ. 7-50-8)
నా కుడి చేతిలో పురుషార్థ మున్నది. ఎడమ చేతిలో జయ మున్నది (పూర్ణ పురుషార్థ మున్నచో విజయము నిశ్చితము)

76) "తిస్రో దేవీర్మహి నః శర్మ యచ్ఛత " - (అథర్వ - 5-3-7)
మాకు మూడు దేవతలు - మాతృభూమి, మాతృభాష, మాతృ సంస్కృతి గొప్ప సుఖము నిచ్చును గాక !

77) "వర్ధమానం స్వే దమే" - (యజు. 3-23)
(దేశ హితానంతరం ముందుగా) మీ ఇంట్లో ఉన్నతిని సాధించుము.

78) "ప్రాతా రత్నం ప్రాతరిత్వా దధాతి" - (ఋగ్. 1-125-1)
ప్రాతః కాలమున మేల్కొని పురుషార్థము చేయువాడు ఐశ్వర్యమును పొందును.

79) "సర్వాన్ పథో అనృణా అక్షియామ" - (అథర్వ. 9-117--3)
అన్నివిధముల ప్రయత్నించి మేము ఋణవిముక్తులము అగుదుము గాక !

80) "కేవలాఘో భవతి కేవలాదీ"(ఋ. 10.117-6)
కేవలము తన పొట్ట నింపుకొనువాడు పాపమునే భుజించినట్లగును.

**నాలుగు వేదాలలో యిట్టి సూక్తులు కోకొల్లలు**

**వేదస్వాధ్యాయం చెయ్యండి - సమగ్ర ఉన్నతిని పొందండి.**

**శమ్ ఇతి ఓ౩మ్**

